# పేరయ్యా రాజంటు!

(నాటకం)



సోమంచి యజ్ఞన్నశాస్త్రి

నవోదయ పబ్లిషర్సు
ఏలూరు రోడ్ విజయవాడ-2

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి
కాసు బ్రహ్మానందరెడ్డిగారికి

బొంబాయి ఆంధ్ర ఎడ్యుకేషన్ సొసయిటీ స్కూలు
భవన ప్రవేశ మహోత్సవ సందర్భంలో
15-11-64 న
సాదర సమర్పితము.

5

# ఒక నిముషం....

ఈ నాటకానికి చారిత్రక ఆధారాలేమీ లేవు. ఒక విధంగా, వేదం వెంకటరాయశాస్త్రిగారు వ్రాసిన ప్రతాపరుద్రీయ నాటకం దీనికి పునాది. ప్రధాన పాత్రలన్నీ ఆయన నాటకంలో మొదటు సృష్టింప బడినవే. ఈ నాటకంలో పరిణామాలు కేవలం ఊహామాత్రం.

"పేరయ్య తనే రాజునని తిరుగుబాటు చేస్తే పరిణామం ఊహించి నాటకం వ్రాసిపెడతారా ?" అన్నశ్రీ ప్రఖ్య శ్రీరామమూర్తిగారి ప్రశ్న నన్ను ఈ విషయమై ఆలోచనకి పురికొల్పింది. తరచి చూడగా, ప్రతాపరుద్రీయ నాటకంలో, పేరిగాడిపాత్ర, హాస్యం మినహా, ఆశిం చిన కార్యం సాధించలేదని తోచింది. పేరిగాడిని ప్రతాపరుద్ర మహా రాజుగా ఓరగల్లులో చూపించి నాటక మాడించమని యుగంధరుల ఆదేశం. పేరిగాడిని మహా మూర్ఖుడుగా చిత్రించడంవల్ల ఆ ఆదేశం పాటించలేక పోయారు జనార్దన ప్రభృతులు. రాజుని పట్టితెచ్చే వ్యూహంలో పేరిగాడివల్ల లాభం ఏమీ కలగలేదు. ఈ పరిస్థితిలో నిజానికి 'ప్రతాపరుద్ర మహారాజు వేటలో గాయపడి అంతఃపురంలో వున్నారు. ఎవరికీ దర్శనమివ్వరు' అని ప్రతాపరుద్రీయం నడిపించినా ఏమీ లోటు వుండదు.

పేరిగాడి పాత్రని యుగంధరులు ఆదేశించినట్టుగా రూపొం దించడం ఎలా ? ప్రఖ్య శ్రీరామమూర్తిగారు చేసిన సూచనకి సమాధానం ఏమిటి ? వీటి సమన్వయ ఫలితమే, నా పేరయ్య. తయారయిన నాటకం 'పేరయ్య రాజంట!'

ఇతివృత్తం కాకతీయ సామ్రాజ్యానికి సంబంధించినది. ఈ సంఘటనలు ఓరుగల్లులో జరిగినవి. అయినా వెంకటరాయశాస్త్రిగారు

పేరిగాడికి సర్కారు యాసపెట్టారు. అదే పాత్రోచిత భాషగా చెల్లుబడి అయింది. పేకయ్య పలుకులో తెలంగాణా యాస అంతకంటె సహజమని ఆ భాష ఉపయోగించడానికి ప్రయత్నించాను. తప్పులు దొర్లివుండొచ్చు. అవకాశం లభిస్తే దిద్దుకుంటాను.

పాటలు, అప్పుడప్పుడు 'సాంప్రదాయిక పల్లెపదాలు' అన్న శీర్షికకింద ప్రచురితమయినవి. సమయోచితంగా వున్నట్టు తట్టగా ఉపయోగించుకున్నాను.

తాను ఆశించిన విధంగా నాటకం పరిణమించక పోయినా, నన్నీ ఇతివృత్తం ఆలోచింపజేసి, ప్రోత్సహించిన శ్రీ స్రఖ్య శ్రీరామమూర్తి గారికి కృతజ్ఞుడిని.

"సాహితి" పత్రికలో ఈ నాటకం లోగడ ప్రచురితము.

— రచయిత.

# ఇందలి పాత్రలు

పేరయ్య : ప్రతాపరుద్ర మహారాజుగారి చాకలి

యుగంధరుడు : మహామాత్యుడు

విద్యానాథుడు : ఆస్థానపండితుడు. మహారాజుకు మహామాత్యునకు అత్యంత ఆంతరంగికుడు

జనార్దనుడు : ఆంతరంగిక మంత్రి

విశ్వాసరావు : ఒక ఉన్నతోద్యోగి

భేతాళరావు : రహస్య వార్తావేది, అంతఃపుర రక్షకాధికారి

అనుమయ్య : మహారాజు నౌకరు

ముస్తఫాఖాన్ : ఢిల్లీసుల్తాను సర్దారు

నజీర్‌ఖాన్ : అతని నౌకరు

ఎల్లి : పేరయ్య భార్య

— ఇంకా —

నౌకరు, సైనికుడు, నర్తకి, గాయనీ గాయక బృందము.

౧

# పేరయ్యా రాజంటు !

## మొదటి అంకం

[ రాజభవనంలో దర్బారుహాలు. సింహాసనం, కొన్ని కుర్చీలు అమర్చి వుంటాయి. వీణ మొదలయిన పరికరాలు. సహం ముస్తులు ధరించి పేరయ్య పచారు చేస్తున్నాడు. హార్మోనిపెట్టి నౌకరు అను మయ్యా పాగా చుట్టాలి. ]

పేరయ్య : యెదవనాయాలా సంపుతుండవురా.

అను : యేలినవారు ఓర్చుకోవాలి.

పేర : యే టూన్ వోర్చేది, గెంజి.

అను : అదికాదు ప్రభూ !

పేర : కాదెట్టా ? గెంజి వోర్చరా ? బుర్రలేని నాయాలా !

అను : చిత్తం; చిత్తం. గంజి వార్చుస్తారు.

పేర : మరి వోర్చమంటివే, నే నెట్టవోరుస్త !

అను : తమ బుద్ధి చాలా చురుకుగా పనిచేస్తోంది. నేనన్నది, ముస్తాబు పూర్తిఅయేవరకు తమరు ఓపిక పట్టాలని. తమరు గంజి వార్చాలని కాదు.

పేర : వారేయ్. యెల్లి సేస్తదిరా గెంజి మా కమ్మగుంటది.

అను : చిత్తం.

పేర : నా యెల్లినినూడక కళ్ళు కాయలు కాసి పోనాయి. దాని గెంజినేక నాలిక సచ్చిపోనాది.

అను : చిత్తం.

పేర : సిత్తం; సిత్తమంటు వేటిరా, యెదవ, నే సత్తుంటె.

అను : బుద్ధి బుద్ధి. తమరు సుఖంగా జీవించాలనే ఈ ప్రయత్నమంతా.

పేర : గిక్కడ సుకమేంటిరా, యెల్లి లేకుంటె వొంటికీ సుకము లేదూ; కంటికీ నిదురలేదూ (అని అటూ యిటూ తిరుగుతాడు)

అను : దుస్తులు ధరించక దర్బారుకి రాకూడదని జనార్దన మంత్రుల వారి ఆజ్ఞ. వారి రాకకి సమయమయింది. వారొచ్చేలోపల మీ అలంకరణ పూర్తికాక పోతే, కోపగించుకుంటారు.

పేర : సీసీ జనార్దనంగోరు పానాలు తీస్తుండరు.

అను : తమ రలా శలవివ్వకూడదు.

పేర : నాకిట్టంలేదు. వూరికె కసురుతుంటరు.

అను : జనార్దన మంత్రిగారు తమ మంచికోరే.

పేర : బెమ్మదేపుడు మంచయ్య.

అను : జనార్దనులవారూ మంచివారే.

పేర : సంపుతుంటే మంచెట్ట! దరబారొద్దు యింటికాడ తొంగుంట నంటె యినరు. దరబారు సెయ్యాలంటరు. దరబారులోకూకున్న కాడనించి, గిదితప్పు, గదితప్పు అంటు కసురుతుంటడు... నేనుండె సాకలోళ్ళ పెద్దని. నన్ను జూస్తే సాకలోళ్ళందరికి అడల్. గిప్పుడు యోగంబట్టి గొప్ప పెబువు, మారాజు నయ్యె నంటరు, నన్ను కసురుతనంటె నాకిట్టంలేదు, యిట్టంలేదు, చిరాకొత్తుండది. చిరాకొత్తె నాచంగతి నీకు తెల్దు. చిరాకొచ్చి

యెల్లి నోపాలి, నా రంగా ... యీవుమీద ఢంఢం, ఢమా దం.
(చిందులు తొక్కుతూ వీవుమీద గుద్దుతాడు)

అను : శాంతించాలి. శాంతించాలి. నేను మీ నౌకరు అనుమయ్యని. ఎల్లినికాను.

పేర : నాకు తెల్దురా, మీసాల యెదవా.

అను : తమ యెల్లికి మీసాలుకూడా వున్నాయా ప్రభూ.

పేర : నున్నగుంటది. నాయెల్లికి మీసాలున్న యంటవురా, యెదవ సచ్చినోడా. యీవు సితగ్గొడతను.
(అని కొట్టబోతాడు. నౌకరు అందకుండా పరుగెడుతూ)

అను : అపరాధం క్షమించాలి.

పేర : ఛమించను. నన్ను తిడితే పడతనుగని, యెల్లినంటె ఛమించను.

అను : చెంపలేసు కుంటాను (అని వేసుకుంటాడు)

పేర : సాలదు. గుంజి తియ్యి నాయాలా!

అను : అంత కఠినశిక్ష కూడదు ప్రభూ.

పేర : సంపుత!

అను : చంపొద్దు. గుంజిలేతీస్తా (అని రెండు గుంజీలు తీస్తాడు తేలికగా, పైపైన.)

పేర : యెదవకి గుంజి తియ్యటం తెల్దు, గిట్టతియ్యాలి. సూడు, (అని రెండు గుంజీలు తీసి చూపిస్తాడు) గిప్పుడుతియ్యి.

అను : వేళ అయిపోయింది. ముస్తాబు పూర్తికాలేదు. జనార్దన మంత్రిగారొచ్చారంటే కోపగించుకుంటారు.

పేర : నాకేం బయంలే. గుంజిలు తియ్యి.

అను : మీ ముస్తాబు పూర్తిచేసి గుంజీలు తీస్తాను.

పేర : నాకొద్దు. గిప్పుడె తియ్యి.

అను : ముస్తాబు చేసుకుని సింహాసనం మీద కూర్చోండి. అప్పుడింకా మజాగావుంటుంది. నేను రెట్టింపు గుంజీలు తీస్తాను.

పేర : సత్తెప్పెమానకంగానా ? సేతులో సెయ్యేసి సెప్పు.

అను : సత్య ప్రమాణకంగా, రెట్టింపు గుంజీలు తీస్తాను.

(చేతులో చెయ్యేసి ప్రమాణం చేస్తాడు.)

పేర : అట్టయితే, ముత్తాబుసెయ్యి. (పాగా చుడుతూవుంటే, తలుచుకుని ఆనందిస్తున్నా.) సామిరంగ, మోకా ళ్ళట్టుకుపోతవి. ఇయ్యాల గిదె, దర్బారులో తమాచా, గిట్ట సెవులట్టుగుతియ్యి.

(అని కుడిచేతితో ఎడమచెవి, ఎడమచేతితో కుడిచెవి పట్టుకుని ఒక గుంజీ తీసి చూపిస్తాడు.)

అను : చిత్తం, ఒక్కక్షణం కదలకుండా కూర్చోవాలి.

పేర : సేతగాని యెదవ! ఒక్క ఛనమంటవు. లక్ష ఛనాలు సేత్తవు. యెల్లికడ సేర్చుకోర! అరచ్చనంలో నన్ను ముత్తాబుచేత్తది. అది ముత్తాబవుద్ది.

అను : చిత్తం.

పేర : యెల్లి! పేరయ్య రాజవుతె, యెల్లి రాణి అవుద్ది; యిద్దరం చింవాచనంమీద కూకోని సడసాలాడ్దామని చంబర పడితె నువ్వు నాకు ఆగుపియకుండనె దాసేసి నారోయ్! నన్ను ఛనం సూడకుంటె నీకు గుబులు పుట్టుకొత్తపగద, యిన్నాళ్ళయి పోయె యెట్టగుంటివె!

అను : కులాసాగానే వుంది ప్రెభూ.

పేర : గెప్పుడు సూపిత్తర్రా నా యెల్లిని.

అను : జనార్దన మంత్రిగారు చెప్పిన మాట మరిచారా ప్రభూ. చెడ్డు దినాలు పోయి మంచిరోజు లొచ్చేదాకా, తమరు యెల్లిని చూడకూడదు.

పేర : యెప్పుడొత్తయిరా, మంచిరోజులు.

అను : నాకు తెలియదు ప్రభూ.

పేర : వోరికి తెల్సురా !

అను : విద్యానాధులవారికి.

పేర : యిద్దానాదు డెవరోస్.

అను : మరచిపోయారా ప్రభూ, మీ బ్రహ్మదేవుడు గారిని.

పేర : (లెంపలేసుకుంటూ) బుద్ది బుద్ది. బెమ్మదేవుడు గోరిని మరిసి పోడమె !

అను : వారొక్కరికే తెలుసు, ఎప్పుడు యెల్లి తమ దర్శనం చేసుకో వొచ్చునో.

పేర : యేరి బెమ్మదేవుడు గోరు. సామి, నాయెల్లి నెప్పుడు నూడొచ్చునని అడుక్కుంటను.

అను : వారూ, జనార్దనమంత్రిగారూ వొచ్చేవేళ అయింది. తమరు ముస్తాబు పూర్తికాకపోతే తమరితో మాట్లాడరు.

పేర : గయితే, తొరగ ముత్తాబు సెయ్యరా నాయాలా !

అను : కదలకుండా ఒక్కక్షణం కూచుంటే ఈపాటికే పూర్తయి పోవును.

పేర : కానియ్యరా నీముత్తాబు. నూసేందుకు యెల్లిలేదు. నాకేం చంతోచంలేదు.

(పేరయ్య కదలకుండా కూచుంటాడు. నౌకరు త్వరితంగా ముస్తాబు పూర్తిచేస్తూ వుంటాడు. జనార్దన మంత్రి ప్రవేశం.)

జనా : ప్రభువువారి నింకా తయారు చెయ్యలేదురా ? దర్బారుకి వేళ అయింది.

అను : అయిపోయిందండి. తయారుగానే వున్నారు. అత్తరురాయ దమే కొదవ.

పేర : అత్తరు గిత్తరు నా కవచరం లేదు.

జనా : ప్రభువువా రేదో కోపగించి నట్టున్నారు.

అను : కోపంకాదు. ఎల్లి దగ్గర లేదని వారికి విచారం—గుబులు.

జనా : తొందరపడకండి. త్వరలోనే మీ కోరిక నెరవేరుతుంది.

పేర : రోజు రోజు కిట్టనె అంటరు. సూపియరు. ఈ దినం సూపిత్తెగని దరబారులొ కూకుండెది లేదు.

జనా : మూర్ఖత్వం పనికిరాదు. చెప్పిన సంగతి మరచిపోయినట్టున్నారు. మీకు యోగకాల మొచ్చేదాకా యెల్లి మీ కంట పడ కూడదు. లేకపోతే దానికీ, మీకుకూడ ప్రమాదం.

పేర : ఆ యోగం యెప్పుడొత్తది సెప్పండి.

జనా : త్వరలోనే అని చెప్పానుగా.

పేర : తొరలో అంటె యేంటి ఒక్క దినమా, రెండుదినాలా, మూడు దినాలా, యెన్ని దినాలు ?

జనా : ఇన్ని దినాలని ఖచ్చితంగా చెప్పలేము. కాని ఆ రోజు రాక మానదు.

పేర : దాన్ని బేగి రప్పించండి, మాప్పెబొ.

జనా : అది నా చేతిలో లేదు.

పేర : ఎవరి సేతిలోవుంది సెప్పండి. ఆ మారాజునే అడుక్కుంట. బెమ్మదేవుడుగోరి సేతిలో వుందని యీ దంటుడు, నిజం చెప్పండి; మాప్పెబొ. బెమ్మదేవుడుగా రేరి ? అయ్యల్లో యెల్లిచంగతి తేలుత్తెగని నే బతకనోయ్.

జనా : (కఠినంగా) అల్లరి చెయ్యకూడదు,

పేర : ఇది అల్లరి కాదయ్యోయ్. నాకు యిరహంగ వుందయ్యోయ్. ఎల్లిని కానకపోతె నాకు సుకంలేదయ్యోయ్. నే చచ్చిపోతా నోయ్. నాకి చింవాచన మొద్దోయ్. నాకి ముత్తా బొద్దోయ్.

జనా : పేరయ్యా, జాగ్రత్త.

పేర : మీరు కోపంజేత్తె నాకు బయం లేదయ్యోయ్. ఎల్లిని కానక పోతెనె నాకు బయమయ్యోయ్.

అను : (జనార్దనుడితో) ఇది నయాన కావలసిన కార్యంగాని భయాన కాదు. మీరు కోపగిస్తే వున్నగోడూ చెడుతుంది. ప్రభూ మీరు శాంతించాలి. మీ బాధ మా అందరికీ అర్థమైంది. కాని మీ కోరిక నెరవేర్చగలిగిన సమర్థులు ఒక్క విద్యానాథులవారే. వారు రాగానే యెల్లి దర్శనం మీకు యెప్పుడు లభిస్తుందో తేల్చేసుకుందాం. ఈ లోగా మీరు దర్బారు విశేషాలు తిలకించండి. మీరు చక్కగా వ్యవహరిస్తే విద్యానాథులవారికి మీ మీద అనుగ్రహం యెక్కువవుతుంది. ఎల్లిని చూసేరోజు దగ్గరకి తీసుకురాగలరు.

పేర : పత్తె ప్పెమానకంగనే! గయితే చరే. దరబారు కానివ్వండి.

(పెళ్ళి సింహాసనంమీద కూర్చుంటాడు.)

యిశేసాలు రానివ్వండి.

జనా : సేవకా, వైణికులను రమ్మను.

(వైణికుడు, మార్దంగికుడు ప్రవేశం.)

పేర : రోజు రోజూ యీ జె. తిత్తి, డోలూ రాకూడ దేటి?

జనా : సన్నాయిమేళం కావాలని కాబోలు ప్రభువువారి ఉద్దేశం. రేపటి దర్బారులో దానిని యేర్పాటు చేస్తాము. ఈనాటికి వీణాగానం వినండి. పరికమించండి.

(వీణావాదన ప్రారంభ మవుతుంది.)

పేర : (చెవులు నిక్కబెట్టుకుని వింటూ) ఈ డేటి, సప్పుడే సెయ్యదు. టుంయ్... టుంయ్. ఇదేటి వోయిద్దెం.

వైణికుడు : తమ అభిప్రాయం సరికాదు ప్రభూ! వీణ సున్నితమైన వాయిద్యమేకాని, అవసరమయినప్పుడు యెంత నాదమైనా సృష్టించగలదు.

పేర : యేటూ.

జనా : అంటే వీణలోకూడా యెంత చప్పుడైనా చెయ్యవొచ్చునని.

పేర : అదెట్టా! సప్పుడు వోయించండి.

(కొంచెం వేగంగా, ఎక్కువ నాదంతో వీణ వాయిస్తాడు వైణికుడు.)

పేర : సెబాస్. ఇప్పు డినిపిస్తవుంది. గని డోలయితె సెవికి తగులుద్ది రేపు డోలట్టుగురా.

వైణి : నేను డోలు వాయించలేను ప్రభూ!

పేర : ఎట్టా! యినిపించని యీణ వోయిత్తవు, యినిపించే డోలు వోయించలేవు. ఇదేటయ్యా!

వైణి : చిత్తం. ఒక్కొక్క విద్వాంసుడు ఒక్కొక్క వాయిద్యాన్నే సాధకం చేస్తాడు. అన్నీ చెయ్యడు.

పేర : అదెట్టా! సాకలోడు తెల్లబట్టలే వుతుకుత, రంగుబట్ట వుతకనంటె కుదురుద్ద! అన్ని వుతకాలి. అట్టగె, మీరు అన్ని వోయిద్దాలు వోయించాలి.

వైణి : చాలా బాగుంది ఉపమానం. ఇహనించీ బట్టలు ఉతికినట్టు వాయిద్యాలనీ పడేసి బాదుతాంలెండి. మరి శలవా, వెళ్ళిరానా·

పేర : యెళ్ళు. గని నువ్వు రావొద్దు. డోలు మేళం అంపించు.

వైణి : తమ చిత్తం, మా భాగ్యం.

(అని వెళ్ళి పోతాడు.)

జనా : సేవకా! నాట్యబృందాన్ని ప్రవేశపెట్టు.

(నాట్యకర్త్రె, ఫిడేలు, మద్దెల వాయిద్యగాళ్ళు ప్రవేశం. నాట్యకర్త్రె అంజలి ఘటించి నించుంటుంది. ఫిడేలు శృతిచేస్తాడు. మద్దెలమీద ఒకటి రెండు దరువుల వాయిద్యం.)

పేర : టింగ్ టింగ్; డుంగ్ డుంగ్. యేటోస్, యీ పాట.

జనా : శృతిచేస్తున్నారు ప్రభూ! పాట యింకా ప్రారంభం కాలేదు.

పేర : యే టాలస్యం ?

జనా : ఆలస్య మేమీ లేదు. పరిక్రమించు నర్తకీ.

(నర్తకి జయదేవుడి అష్టపది అభినయం ప్రారంభిస్తుంది.)

**సావిరహే తవదీనా; కృష్ణ,**
**సావిరహే తవదీనా,**
**మాధవ మనసిజ విశిఖ భయాదివ,**
**భావనయాత్వయిలీనా సావిరహే.**

(మనసిజ విశిఖభయాదివ అన్నచోట మన్మథుడు బాణాలు వేసినట్టు అభినయిస్తుంది. అది తనమీద బాణాలు విసిరినట్టు భావిస్తాడు పేరయ్య)

పేర : అట్టె అట్టె. తగ్గు తగ్గు. నామీ దేటి బానాలు యిసిరేస్తుండవు!

జనా : మీా మీాదకాదు ప్రభూ. మన్మథుడి బాణాలకి తట్టుకోలేక కృష్ణభగవానుడిమీాద విరహంతో రాధ, బాధపడిందన్నభావం అభినయిస్తోంది నర్తకి.

పేర : యిరహం అయ్యల్లో, నాకెంత యిరహం నాయెల్లి అగుపియక నాకెంత యిరహం.

నర్తకి : తమ విరహం అభినయించి చూపించమని ఆజ్ఞా ప్రభూ!

పేర : నాయిరహం నీకేటి తెలుస్తది. వొల్లంత వుడుకెత్తిపోద్ది, గుబులు గుబులుట్టుకొస్తది.

నర్తకి : కళాకారులు ఊహించుకోగలరు ప్రభూ!

యెల్లి నాకూ అగుపియాకుంటె
వొల్లు అంతా యేడెక్కిపోయె
గుండెలోనా దిగులుబుట్టె
కళ్ళలోనా, నీళ్ళుకారే
మండిపోయే, నా దేహమంతా
యేడ నుంటివె యెల్లీ, నీ వేడనుంటివె, యెల్లీ.

(పాట కొంచెం అతిగా వికృతంగా అభినయిస్తుంది.)

పేర : భేష్—శభాష్. నాయిరహం గొప్పగ ఆడావు. తీసుకొ యీా అరం.

(మెడలోంచి హారం తీసియిస్తాడు. నర్తకి అందుకుని నమస్కారం చేస్తుంది.)

పేర : మరేటి వొద్దోయ్ నా యిరహం యిగ బరించలేను. మీారు పొండి, పొండి (నర్తకి బృందం నిష్క్రమిస్తారు) యిరహం

బరించలేను యెల్లి నెప్పుడు సూపిత్త రయ్యోయ్. బెమ్మ దేవుడు గారోయ్.

(పెద్దకేక పెడతాడు విద్యానాథుడు ప్రవేశం)

విద్యా : పేరయ్యా! ఏమిటీ కేకలు ?

(పేరయ్య అకస్మాత్తుగా లేచి, విద్యానాథుడి కాళ్ళు పట్టుకుని)

పేర : యెల్లినెప్పుడు సూడొచ్చునో సెప్పండి బెమ్మదేవుడా!

విద్యా : కొన్ని మాసాలదాకా నీకు యెల్లి దర్శనం కలగదని చెప్ప లేదూ.

పేర : సెప్పారు. దేవుడో సెప్పారు. యెల్లిని సూడకుంతె గుబులుట్టు కొస్తుండది. నేబతకలేను.

విద్యా : గ్రహస్థితి మారేలోగా యెల్లి నీ కంట బడితే దానితల ముక్కలయిపోతుంది. అది బతకదు.

పేర : వోరయ్యో యెల్లికే పెమాదం! అది నేకపోతే నేనచలు బత కను.

విద్యా : గ్రహించావా పరిస్థితి ? నే అనుమతి యిచ్చేదాకా, నువ్వు యెల్లిని చూడకూడదు. అది నీకంటబడినప్పుడు దానికి మరణయోగం. దాని వియోగం భరించలేక నీకుకూడామరణం.

పేర : రచ్చించండి, సామి, రచ్చించండి.

విద్యా : రక్షిస్తాను. నా మాటకి అడుగుదాటకూడదు. ఇక్కడినించి కదలకూడదు.

పేర : మహాప్పెబో కదలను. గిక్కడెకూకుంటను (అని నేలమీద చతికిల పడతాడు)

జనా : ప్రభువులు నేలమీద కూర్చుండుట తగదు. ఆసనంమీద ఆసీనులుకావాలి.

పేర : బొమ్మదేవుడు కదలొద్దన్నరు. కదలను (అని మఠంవేసుకు కూచుంటాడు)

జనా : మూర్ఖుడు, ఏమీ అర్థంకాదు.

విద్యా : ఆ మూర్ఖత, తెలివితక్కువ తన మేకదా మనకి రక్ష. వీడే తెలివిగలవాడయితే, మన నాటకానికి ప్రమాదం గదా !

జనా : నిజమే. కాని అతిసామాన్య విషయాలూ అర్థంకావు. వీడివల్ల కార్యసాధన యెలా చేసుకోవాలో తెలియకుండావుంది.

విద్యా : నామీదఅమితవిశ్వాసం కుదిరింది. కళ్ళుమూసుకుని నూతిలో వురకమన్నా వురుకుతాడు నిస్సంకోచంగా. అంతకంటె మనకి కావలసిందేముంది కార్య సాధనకి.

జనా : తమరు గ్రహించలేని దేమున్నది. మహారాజుగారు వేటలో గాయపడ్డారనీ, స్వస్థత చేకూరేవరకూ ఎవరికీ వారిదర్శనం కాదనీ, ఇంతవరకూ అందరినీ ఆపుచేసి వుంచాము. కాని ఎంతకాలం వారి గాయాలు మానడం లేదని చెప్ప గలము. మహారాజుని చూపించి, అవసరమయిన వారికి దర్శన మిప్పించి పేరిగాడు ప్రతాపరుద్ర మహారాజుగా నాటక మాడించమని మహామంత్రుల ఆజ్ఞ. రాజోద్యోగులు, పురప్రము ఖులు, రాజదర్శనానికి ఆత్రుత పడుతున్నారు. ఆకార సాదృశ ముపయోగించుకుని కథ నడుపుకుందామన్నా దూరంనించి చూపించి పొమ్మనడానికి వీలులేదు; సమ్ముఖానికిరానిచ్చి దర్శన మిప్పించక తప్పదుగద, మౌనంగా కూర్చోలేడు. పలక రిస్తే అపశ్రుతులు. నమ్మి, నోరు విప్పనివ్వడానికి అసలే వీలు లేదు. ఇప్పటికి పదిరోజులనుంచీ ప్రయత్నం. వివిధ వేషాలతో వొస్తున్న అంతరంగికులతోకే దర్బారు ఏర్పాటుచేసి చూస్తు న్నాము. రాజరికపుచేష్ట ఒక్కటి అలవడలేదు. నోరువిప్పి ఒక్క మాట మాట్లాడలేదు. నోరుమూసుకు కూర్చోడు. ప్రతాపరుద్ర

మహారాజు కోటలో ఆరోగ్యంగా వున్నారనీ విశ్వాసం పుట్టించే విధంగా కథ నడిపించవలసిన బాధ్యత మన మీద విడిచి వెళ్ళారు యుగంధరులవారు. ఏమీ పాలుపోవడం లేదు.

విద్యా: ప్రతాపరుద్రుడేనని భ్రమింపచెయ్యగల ఆకారము పేరిగానికి, భగవంతుడే ప్రసాదించాడు. దానిని వినియోగించుకుని కార్య సాఫల్యం చేసుకోవలసినది, మన చతురత, ప్రతిభ. ఆ కార్య చతురత, ప్రతిభ, మనలో వుందన్న నమ్మకమే ఈభారం మన కప్పగించి వెళ్ళడానికి సాహసమిచ్చింది మహామంత్రుల వారికి. వారి ఆజ్ఞ వృధా పోకూడదు పోదు. వారి విశ్వాసం అన్యధా కాదు.

విశా: గరుత్మంతుని శక్తి గద్దల కుండదని వారితోనే మనవి చేసుకున్నాను.

విద్యా: శేముషీధురంధరులు, ప్రతిజ్ఞాపాలకులు, యుగంధరులవారి శాఘీదు పొందిన మంత్రి సత్తములు అనదగిన మాటకాదు. ఘటనా ఘటనా సమర్థులు, యుగంధర మంత్రిసత్తములు. వారి ప్రయత్నాలకి ఆటంకం వుండదు. వారి వ్యూహానికి తిరుగుండదు. యుగంధరులవారు ఏడిలో వున్న మూర్ఖత్వమేకాదు, విశ్వాసంకూడా పసి కట్టారు. కనకనే నమ్మి మన చేతిలో పెట్టారు. వారి ఆత్మ విశ్వాసమే మనకురక్ష. పేరిగాడు మన అవసరాలకి ఇంకా ఉపయోగపడ లేదంటే దానికి కారణం వాడి అసమర్థత కాక, మన ప్రయత్నలోపం కావచ్చును.

విశా: విద్యానాధుల అసాధారణ శక్తి సామర్థ్యాలు నే నెరుగనివి కావు, కాని.

విద్యా: నా శక్తి సామర్థ్యానికి కానులుండవచ్చు కాని యుగంధరుల ప్రజ్ఞకి కాదు. వారి ప్రజ్ఞ మన నావహించి కార్యసాఫల్యం చేకూర్చుకోగలదు తప్పదు.

జనా : నా అవిశ్వాసానికి క్షమార్హుడిని. శలవిప్పించండి. ఏమి చెయ్యాలో.—

విద్యా : ప్రస్తుతానికి మీరు చెయ్యగలిగిన దేమీలేదు. మీరేమీ చెయ్యవొద్దు. వీడిని నాకు వొదిలిపెట్టండి.

జనా : తమ వ్యూహ మేమిటో.

విద్యా : వ్యూహంకాదు. కృషి. రాజుగా వ్యవహరించడానికి తగిన శక్తిసామర్థ్యాలు వీడికి కలిగించడమే.

జనా : అర్థం కాలేదు.

విద్యా : ఆకార భ్రమ ఎలానూవుంది. దూరంనించే కాదు. దగ్గరనించి చూసినా, ప్రతాపరుద్రుడేనని విశ్వాసం కలిగించే ఆకారం వీడికి భగవంతుడే ప్రసాదించాడు. ఇక నాలుగు క్షణాలు సంభాషించి రాజునేనని భ్రమింప చెయ్యగల రాజరికపుచేష్టలు భాష, మనం నేర్పాలి. భగవత్సృష్టికి పురుష ప్రయత్నం తోడ్పడాలి.

జనా : జ్ఞానం ఇవ్వడం మన తరమా.

విద్యా : జ్ఞానం మనం ఇవ్వలేము. అది భగవత్ప్రసాదమేకాని భ్రమకి మూలం ఆకారంగద! ఆభ్రమ చెడకుండా కాపాడుకోవాలి. వాడి భాష ఆ భ్రమని చెడగొట్టే ప్రమాదం. ఆ ప్రమాదాన్ని పరిహరించాలని మనకృషి. నోరు విప్పగానే పట్టుబడకుండా రెండుముక్కలు చెప్పి ప్రజల మన్ననలు అందుకుని పంపించే టట్టు చెయ్యాలి.

జనా : నోరువిప్పితే అపశ్రుతులు, చాకలియాస. వీడిచేత రెండు మాత్రం మాటలు పలికించడం ఎలా? కోతి చేష్టలు మాన్పించి శుద్ధమైన, రాజోచితమైన నడవడి నేర్పించడమెలా.

విద్యా : భాష ఉచ్చారణాత్మకం. మాట్లాడవలసిన విషయం గ్రహించే

జ్ఞాన ముండక పోవచ్చు కాని, కొన్ని మాటలు ఉచ్చారణ నేర్పవచ్చును. చిలకకే పలుకులు నేర్పడం లేదూ ?

జనా : ఏ భాష తెలియని చిలక విషయంలో అది సంభవమేమో గాని, అపభ్రంశపు భాషకి అలవాటు పడిన మనిషి విషయంలో ఇది సాధ్యమా.

విద్యా : ఎందుకు సాధ్యంకాదు. మరికొంత కష్టతరం. అంతే. శిశువుకి ఉచ్చారణ, భాష, ఎలా పట్టు బడుతుందో ఆలోచించారా. పెరిగిన వాతావరణంలో, చెవిని బడుతున్న ఉచ్చారణలో, దాని భాషా, ఉచ్చారణా తయారవుతుంది. పుట్టుకకాదు, వినికిడి. స్వతఃసిద్ధం కాదు. నేర్పుకి ఫలితం మన ఉచ్చారణ. పెద్దయిన తరువాత మరో ఉచ్చారణ నేర్పడం కఠినమేగాని, అసంభవం కాదు.

జనా : వాడికి నోరు తిరగొద్దూ.

విద్యా : దానికీ శాస్త్రం లేకపోలేదు. ఏ అక్షరం, శబ్దం, ఎక్కడినించి పలుకుతుందో వ్యాకరణంలో మనకి వివరించినదే. సాధకమున సమకూరని పనులులేవు. క్రమంగా ఉచ్చారణ మారిపించవచ్చును.

జనా : తమశక్తి కాదనగలిగిన వారెవరు.

విద్యా : నాశక్తేకాదు వాడి కృషికూడా అవసరమే. నా మీద వాడికి ఉన్న విశ్వాసమే వాడిచేత ఆ కృషిని చేయిస్తుందన్న నమ్మకం నాకుంది.

జనా : తమనమ్మకం, మాకు ప్రాణం. ప్రయత్నం ప్రారంభించండి.

విద్యా : పేరయ్యా. ఈ మహలుదాటి పైకి వెళ్ళకూడదన్నాను గాని, ఇక్కడే చతికిలబడ మనలేదులే.

పేర : నాకు తెలవదు. కదలొద్దు. కూకోమన్నరు. కూకున్నను.

విద్యా : పేరయ్యా! నీ కిప్పుడు మహా యోగకాలం. మహా ప్రభువు అవాలి. విగటిస్తే ప్రాణం పోతుంది. రాజు వవుతావో ప్రాణం పోగొట్టుకుంటావో నీ చేతిలో వుంది.

పేర : బెమ్మదేవుడా, మీా రెట్టచెబితె అట్ట చేస్తును.

విద్యా : తు. చ. అక్షరం తప్పకుండా.

పేర : అచ్చరం తప్పకుండ.

విద్యా : అచ్చరంకాదు. అక్షరం.

పేర : అచ్చరం.

విద్యా : పేరయ్యా! నువ్వు మహారాజువి. ముస్తాబు మారింది. ఉచ్చారణ మారాలి.

పేర : వుచ్చార. యేటి సెయ్యాలో సెప్పండిబాబు. పీక తెగిపోన సేసేస్తను.

విద్యా : పీక తెగిపోతే నువ్వు చేసేది యేమీాలేదు. అక్షరాలా స్వచ్ఛంగా పలకాలి.

పేర : అచ్చరాలు, సొచ్చెంగా

విద్యా : అక్షరాలు.

పేర : అచ్చరాలు.

విద్యా : 'చ' కాదు. 'క్ష'

పేర : (వొత్తి) చ్చ!

విద్యా : నాలిక మడిచి, అంగటికి తగిలించి వొదలాలి, 'క్ష'

పేర : (గట్టిగా) చ్చ!

విద్యా : నా కేసి తిన్నగా చూడు. నాలిక జావు. (తన నాలిక జావి చూపిస్తాడు.) నాలిక మడిచి అంగటికి తగిలించు. (చూపిస్తాడు.)

పేర : (దగ్గరికి వెళ్ళి నోట్లోకితొంగిచూసి, తనుకూడా నాలికలోపలికి

మడిచి, జోరుగా) చ్ఛ! వోరయ్యల్లో నాలిక మడతడిపోనా దోయ్. నాయనోయ్ (అని గెంతుతాడు).

జనా : వీడిని పుత్రంపెడితే నేరవగలడా!

విద్యా : తప్పు నాది. మధ్యలో కఠినాక్షరాలతో ఆరంభించకూడదు. క్రమపద్ధతిని శిక్షణిస్తే, ఫలించకమానదు.

పేర : సిచ్చించండి బాబూ, సిచ్చించండి. బుద్దిలేనోడిని.

విద్యా : శిక్షించడం కాదు, పేరయ్యా, శిక్షణ.

పేర : సిత్తం. సిచ్చనే యెయ్యండి.

విద్యా : సరే నే సెప్పినట్టు అను ... అ

పేర : అ

విద్యా : ఆ

పేర : ఆ

విద్యా : ఇ

పేర : యి

విద్యా : యి కాదు ... ఇ

పేర : యి

విద్యా : నోరుతెరు. నాలిక కదపకు గొంతుక దగ్గరనించి అను.

(అనుగుణంగా పేరయ్యా నోరు తెరిచిపెట్టి పలుకుతాడు)

పేర : (వెలుగు రాసిన గొంతుకతో) ... ఇ

విద్యా : మళ్ళీ ... ఇ

పేర : (కొంచెం తిన్నగా) ... ఇ

విద్యా : అదుగదీ మళ్ళీ ... ఇ

పేర : ఇ

విద్యా : భేష్ ... ఇ

పేర : ఇ

విద్యా : శభాష్. తరువాత అక్షరం ... ఉ

పేర : వు

విద్యా : ఇందాకటిలాగే నోరుతెరిచి గొంతుక దగ్గరనించి రానివ్వాలి ... ఉ

పేర : (మొహం, వికృతంగా పెట్టి ప్రయత్నిస్తూ) ... ... వు.

విద్యా : ఉ.

పేర : (గొంతుక చీల్చుకుని) ... ... ఊ.

విద్యా : వస్తోంది ... ... ఉ.

(పేరయ్య విద్యానాధునితో "ఉ" అంటూవుంటాడు. అంతకంతకి "ఉ" స్పష్టంగా పలుకుతోంది. దీపాలు నెమ్మదిగా కాంతిహీనమయి ఆరిపోతాయి.)

(కాల గమనాన్ని సూచించడానికి కొన్ని క్షణాలు చీకటి. తరువాత చీకటిలోనే పేరయ్య, విద్యానాధుల గొంతుకలు వినిపిస్తాయి. ఒక్కొక్క మాట విద్యానాధుడు చెబితే దానిని మళ్ళీ పేరయ్య తిరిగి అంటూ వుంటాడు. ఒక్కొక్కప్పుడు పెరయ్య తప్పు పలికితే దానిని విద్యానాధుడు దిద్ది మళ్ళీ చెబుతాడు. కొన్నిమాటలు రెండు మూడుమార్లు అంతేనేగాని, పూర్తిగా ఉచ్చారణ కుదురదు.)

అంకము ఈడుజోడు

ఆగమనము ఉదాహరణ

ఇంచుమించు

(ఈ మాటవరకొచ్చేసరికి లైట్లు కొంచెం వెలుగుతాయి. విద్యానాథుడు ఒక కుర్చీమీద కూర్చుని మాటలు చెబుతూ వుంటాడు. పేరయ్య మరో కుర్చీమీద కూర్చుని ఒక మాట అంటే, మరోమాట పచారుచేస్తూ అంటాడు. ఒకమాటు విద్యా నాథుడి నాలిక ఎలా తిరుగుతోందో చూడ్డానికి తలవొంచి ఆయన మొహంలోకి చూస్తాడు.)

ఊరేగించు ఓర్వలేమి

ఒడ్డాణము ఔషధము

('ష' తిన్నగా పలకదు పేరయ్యకి. 'ఔషధము' అన్న మాటతో కుస్తీ పడుతూవుండగా మళ్ళీ చీకటి.)

(ఒక్కక్షణం నిశ్శబ్దం లేక వాద్య సంగీతం. తరువాత మళ్ళీ పేరయ్య గొంతుక వినిపిస్తుంది. పేరయ్య యిప్పుడు వాక్యాల్లో పడ్డాడు. అక్షరాలు పట్టి పట్టి 'శ్రీరామచంద్రుడు దశరథమహా రాజు ప్రథమ పుత్రుడు' అన్న వాక్యం వల్లిస్తున్నాడు. ఉచ్చా రణ గుర్తుపట్టలేనంత మారిపోయింది. 'ప్రథమ, పుత్రుడు' అన్న మాటలుమాత్రం యింకా బాధిస్తున్నాయి. ఆగి, ఊపిరితీసుకుని ఆ మాటలు రెండూ ఒక్కొక్క అక్షరమూ రెండు మూడు మాట్లు అంటాడు.)

[కాంతి ఎక్కువై పూర్తిలైట్లు వెలుగుతాయి. నౌకరు అను మయ్య, పేరయ్య వున్నారు.]

పేర : అయ్యల్లో! నాలి కెండిపోనాది. దవడ నొప్పి. నే ఇంక అన్లేనురోయ్.

అను : వొచ్చేస్తోంది. ఇప్పుడు మానేస్తే మొదటికొస్తుంది. మళ్ళీ చెప్పండి.

పేర : (నాలిక పైకిపెట్టి) యెండిపోనాదిరా. పలకలేను.

అను : నాలిక ఎండిపోతే మంచినీళ్ళుతాగి, మళ్ళీ ప్రారంభించండి.

పేర : నచ్చత్రకుడా, సంపుతుండవురా.

అను : విద్యానాథులవారు వొచ్చేసరికి, వాక్యమంతా చెబుతానని మాటయిచ్చారు. ఆయన కిచ్చినమాట తిరిగిపోకూడదు.

పేర : బుద్ది బుద్ది. బెమ్మ దేవుడికిచ్చిన మాటకి తిరకాసులేదు. తీసుకురాయేన్ మంచినీల్లు.

(అనుమయ్య మంచినీళ్ళు యిస్తే, తాగి మళ్ళీ ప్రథమ, పుత్రుడు, అన్నమాటలు అక్షరక్రమంగా పలికి, తరవాత వాక్యమంతా ఒక్కమాటు తప్పులేకుండా అంటాడు నేర్చుకున్న భాషలా కనిపించినా ఉచ్చారణ స్వచ్ఛంగా వుంది.)

అను : శభాష్. బాగా వొచ్చింది.

పేర : నీ మెప్పెవడికి కావాల్రా యెదవ నాయాలా!

(మాటలో విద్యానాథుడు ప్రవేశం)

విద్యా : పేరయ్యా. ప్రభువుల నోటినుంచి వెలువడవలసిన తిట్టే అది?

పేర : ఛమించాలి, అపరాదం.

విద్యా : (పేరయ్యని అనుకరిస్తూ) ఛమించాలి, అపరాదం, రెండు మాటలు తప్పుగానే ఉచ్చరించావు, అవునా,

పేర : చిత్తం.

విద్యా : వొచ్చిన మాటలే మరిచిపోతే ఎలా?

పేర : యెదవబుర్ర అన్నీ మరిచిపోద్ది.

విద్యా : ఆ బుర్రని అదుపులో పెట్టుకోవాలి. మరిచిపోనివ్వకూడదు.

పేర : శానమాట్లు బుద్ధిసెప్పిన, మల్లి మరచిపోద్ది. (బుర్రమీద మొట్టికాయ వేసుకుంటూ) బెమ్మదేవుడికి కోపమొస్తది. మరిచిపోకు.

విద్యా : సరే. ఇప్పుడుచెప్పు. ఆ మాటలు ఎలా పలకాలి.

పేర : యే మాటలండి. (కిందకీ మీదకీ చూస్తూ, తికమకబడుతూ) యెరిక రావడంలేదు.

విద్యా : (జ్ఞాపకంచేస్తూ, పేరిగాడు ఉచ్చరించిన రీతిగా) ఛమించాలి. అపరాదం.

పేర : తప్పు తప్పు. గ్యాపక మొచ్చింది. క్షమించాలి. అవరాధం.

విద్యా : భేష్. నేర్చుకున్నవి మరిచిపోయి, మళ్ళీ మొదటికి రాకూడదు.

పేర : చిత్తం.

విద్యా : ఏ ముక్కయినా, జ్ఞాపక ముండదనితోస్తే మరో పదిమార్లు వల్లించు.

అను : ప్రభువువారు ఏదైనా గట్టిగా జ్ఞాపక ముంచుకోవాలంటే గుంజీలు తీస్తారులెండి. అది అప్పుడు మెదడులో కాక పోయినా, మోకాళ్ళలోనైనా గట్టిగా పట్టుకుపోయి జ్ఞాపక మొస్తుంది!

విద్యా : హాస్యానికి సమయంకాదు, అనుమయ్యా.

అను : నోరుజారింది క్షమించాలి.

విద్యా : సరే (పేరయ్యతో) నే చెప్పిన వాక్య మొచ్చిందా?

పేర : వో. (ధీమాగా) శ్రీరామచంద్రుడు దశరథమహారాజు ప్రథమ పుత్రుడు.

విద్యా : శభాష్. పేరయ్యా. ఈవిధంగా కృషిచేస్తే, నీయోగం అడ్డ గల వారెవరూవుండరు.

పేర : అయితె యెల్లొస్తుందన్నమాట.

విద్యా : యెల్లిమాట యెత్తకూడదు నే చెప్పేదాకా. ఆసంగతి మరచిపోకూడదు.

పేర : చిత్తం.

విద్యా : మాటలు నేర్చినట్టే చేష్టలూ నేరవాలి. తమరు ప్రభువులు. సింహాసనముమీద ఆసీనులు కండు.

(పేరయ్య ఆమాట తిరిగి చెప్పాలనుకుంటాడు)

పేర : సింహాసనముమీద ఆసీనులుకండు.

విద్యా : నే చెప్పినమాట తిరిగి చెప్పమనడంలేదు. చెప్పినట్టు చెయ్య మంటున్నాను.

పేర : చిత్తం.

విద్యా : వెళ్ళి సింహాసనముమీద కూర్చో.

(పేరయ్య కుర్చీమీద కూర్చుని అలవాటు చొప్పున కాళ్ళు పైకెత్తి మఠం వేసుకోబోతాడు. విద్యానాధుడు ముక్కుమీద వేలేసుకుంటాడు. నాలికకరుచుకుని పేరయ్య కాళ్ళు కిందకిపెట్టి ఠీవిగా కూచుంటాడు. నౌకరు విసనకర్ర తీసుకుని విసరడం ప్రారంభిస్తాడు.)

విద్యా : నువ్వు రాజువి. మహారాజువి.

పేర : సాకలోళ్ళందరు... ...

విద్యా : మాట జాగర్త.

పేర : బుద్ది బుద్ధి. చాకలివాళ్ళందరూ...

విద్యా : కేవలం చాకలివాళ్ళ రాజువే కాదు. నువ్వు యీ మండలానికి రాజువి. ప్రతాపరుద్రమహారాజుగారి ప్రతినిధివి. నువ్వే ప్రతాపరుద్ర మహారాజుగారిలా వ్యవహరించాలి.

పేర : బాబోయ్. పెతాపరుద్ద... ...

విద్యా : (కొట్టినట్టు) మాట జాగర్త.

పేర : (సరిదిద్దుకొని) ప్రతాపరుద్ర

విద్యా : (మాటలో అందుకుని) మహారాజులా వ్యవహరించాలి. ఈ సింహాసనపు గౌరవ మర్యాదలు కాపాడాలి. నీ నడవడికి దేవతలే హర్షించి, నీ యోగం ఫలప్రదంచేసి, నీ యెల్లిని నీకు ప్రసాదించాలి.

పేర : వా, రె, నా రంగ.

విద్యా : కాదు. లేచి నమస్కరించి... ...ఊ...(పేరయ్య లేస్తాడు) నమస్కరించి (శిరస్సువంచి నమస్కరించే భంగిమలో విద్యానాథుడు నించుంటాడు. పేరయ్య అనుకరిస్తాడు.) మహాప్రసాదం అనాలి.

పేర : మహాప్రసాదం.

విద్యా : శుభమస్తు. తిరిగి ఆసీనులు కండి.

(ఈ మాటు తప్పుచెయ్యకుండా ఠీవిగా కూచుంటాడు పేరయ్య.)

విద్యా : మీరు అలవరుచుకోవలసినది అనువైన చేష్ట. ప్రతి చేష్టలోనూ ఠీవి. అనువైన చేష్ట అంటే, ఎప్పుడు ఏమి

చెయ్యాలో నేర్చుకోడం. కేవి అంటే పనిచేసే పద్ధతి, రీతి నేర్చుకోడం. అర్థమయిందా? నడక మొదలు శయనందాకా ప్రతి పనీ నేర్చుకోవాలి. కళ్ళు, చెవులు శ్రద్ధగా అప్పగించి, చూసి, విని నేర్చుకోవాలి.

(సింహాసనముమీద వొంగిపోయిన నడుముతో కూర్చు న్నాడు పేరయ్య. విద్యానాధుడు వెళ్ళి నడుము నిటారుగా పెడతాడు. తర్వాత ఎదురుగా నించుని చూస్తూవుంటే పేరయ్య నడుము జారుతుంది. నిటారుగా కూర్చోమని విద్యానాధుడు సంజ్ఞచేస్తాడు. పేరయ్య సరిదీసుకుని కూర్చుంటాడు. ఒక్క క్షణం తీక్షణంగా చూస్తూ బాగుందని ఆమోదనగా విద్యా నాధుడు తల పంకిస్తూవుంటే, దీపకాంతి తగ్గి, దీపాలు ఆరి పోతాయి.

కాలగమనాన్ని సూచించడానికి కొన్ని క్షణాల చీకటి. వెనక వీణానాదం. తరువాత తిరిగి దీపకాంతి. పేరయ్య సింహాసనంమీద పూర్వంలాగే కూర్చుని వున్నాడు.)

విద్యా : శిక్షణ పరిసమాప్తి అయింది. తమరు ప్రభువులన్న సంగతి కలలోనైనా మరవకూడదు.

పేర : అలాగే.

విద్యా : సేవకా, ప్రభువులకు అభివాదం చెయ్యి.

అను : జయము జయము మహారాజా.

పేర : (ఒక క్షణం ఆలోచిస్తూ ఏమనాలో పాలుపోక వుండి పోతాడు. తరువాత ఒక్కొక్క అక్షరమూ పలుకుతున్నా స్వచ్ఛంగా) ఏమి విశేషము?

విద్యా : విజయోస్తు, రాజేంద్రా.

పేర : (ఇహ సంకోచంలేదు అదేవద్దతిలో) రండు మంత్రిసత్తమా! ఆసీనులుకండు.

విద్యా : జనార్దనమంత్రి సత్తములు తమ దర్శనానికై వేచియున్నారు. వారిని రమ్మని సెలవా ?

పేర : ఓ సెలవే.

విద్యా : మితంగా; అవసరమయినంతవరకే భాషించాలి. అది మరవ కూడదు.

పేర : మరవను.

విద్యా : దర్బారు ఏర్పాటు చేయించడానికి ఇక ఏ అభ్యంతరమూ లేదు. ఈవార్త జనార్దన మంత్రికి చెప్పిరావాలి.

పేర : చెప్పిరండి.

విద్యా : (ఆశీర్వదిస్తూ) శుభమస్తు.

పేర : (ఠీవిగా) నమస్కారము.

విద్యా : విజయోస్తు. (దీవించి వెళ్ళిపోతాడు)

(పేరయ్య కుర్చీమీద అలానే కూర్చుని వుండిపోతాండు. సేవకుడు విసరడం మరిచిపోతాడు. కునికిపాట్లు పడుతున్నాడు.)

పేర : సేవకా

అను : (ఉలిక్కిపడి) చిత్తం ప్రభూ

పేర : యిసర్రా, నాయాలా !

అను : తప్పు తప్పు, ప్రభువు లనదగినమాటకాదు.

పేర : నాకు తెల్దేంటిరా. యెదవ (కీవిగా) సేవకా, విసురుమురా. (సేవకుడు విసరడం ప్రారంభిస్తాడు) వీణ వాయించమను.

(వెనుకనుంచి వీణానాదం వినిపిస్తుంది)

ఏటనుకున్నావ్. గికనూడు మన తమాసా.

(త్వరితంగా తెర)

# రెండో అంకం

[ ఓరుగల్లులో, ఓ వీధిలో ఓ యిల్లు. ఢిల్లీ సుల్తాన్‌గారి సర్దారు ముస్తఫాఖాన్ అతని నౌకరు నజీర్‌ఖాన్ మాట్లాడుకుంటున్నారు. ]

ముస్తఫా: మూడురోజుల్లా వాకబ్ చేస్తున్నాం నజీర్‌ఖాన్. రహస్యం ఏమీ చిక్కలేదు! నిజం ఏమీ తెల్వడంలేదు.

నజీర్ : జీ నహీ, సర్కార్.

ముస్తఫా: పెతాపరుద్దర్‌రాజు ఢిల్లీలో బందీ అంటె నహీ రాజు వరంగల్ కోటలో వున్నారు. ఢిల్లీలో బందీరాజు నహీ. చాకల్‌వాడు. చాకల్‌వాడు అని శికందర్ వజీర్‌వార్కి పుకార్ తెల్సింది. ష్వయంగా చూసి కన్పెట్టి రమ్మని హుకుమ్. ష్వయంగా చూసి కన్పెట్టడానికి మమ్మి వొచ్చాము. కాని రాజాకి దర్శనం కావాలంటే దొర్కదు. రాజా నిజంగా కోటలో వున్నాడు లేదు తెల్సేది లేదు.

నజీ : వున్నారు అని నగ్రంలో అంతా అంటారు సర్కార్.

ముస్త : ఆ ఖబర్ నమ్మేది వుంది, లేదు, సందేహం వుంది నజీర్. రాజావార్కి యెవరు చూశారు?

నజీ : నహీ సర్కార్. వార్కి యిప్డు యెవరు చూడలేదు. వార్కి వేటాలో గాయాల్ తగిలి ఎవరికీ దర్శనం యిచ్చేదిలేదు. దర్బార్‌కి వొచ్చేదిలేదు.

ముస్త : ఢిల్లీలో రాజు కన్పిస్తాడ్. వరంగల్లో రాజు కన్పించడ్. ఢిల్లీలో కన్పించేది రాజు లేదు. వరంగల్లో కన్పించనివాడు రాజు. క్యాబాత్ హై.

నజీ : వరంగల్లో వో చాకల్‌వాడు రాజుగారికి బరాబర్ వున్నాడు. వాడ్కి రాజుచెప్పి పట్కుపోయార్ అని వుకార్.

ముస్త : అరె. ఆ ఖబర్ మాకీ తెల్సు. దాన్కి పరీచ్ఛచేసి నిజం కన్పెట్టివాలా వుద్దేశంమీద వరంగల్ వొచ్చాం సంగతి మొదల్ చెప్పిందిలేదు ?

నజీ : జీ హాఁ. చెప్పిందివుంది.

ముస్త : చాకల్‌వాడు అస్సల్ వున్నాడులేదు. వాకబ్ చేసినావ్.

నజీ : చేశాను సర్కార్. పేరిగాడు నామ్‌కా చాకలివాడు వుండే వాడు చాలామంద్కి తెలుసు. వాడ్కి దూరంనుంచిచూస్తే రాజు బరాబర్ కన్పించేది వుంది. అంటారు సర్కార్.

ముస్త : ఇప్డు వాడు వుండేది లేదూ ? ఏమ్టి అయినాడు.

నజీ : ఇప్డు గాయబ్ అయిపోయినాడు సర్కార్. వాడ్ని రాజు అనుకొని ఢిల్లీ పట్కునిపోయారు. మేం వాడ్ని తీస్కొ వొచ్చి నీకు వాపస్ యిస్తాం అని యుగందర్ మంతిరి వాడి పెళ్ళాన్కి చెప్పి వారూ గాయబ్ హెూగయా సర్కార్.

ముస్త : పెళ్ళాన్కి నువ్వు చూశావ్. బాత్ చీత్ చేశావ్.

నజీ : బాత్ చీత్ చేసిందిలేదు కాని, చూశాన్ సర్కార్. మొగ్డు కన్పించడంలేదు అని యేడుస్తుంది. దాన్కి రాజమహల్ నించి రోజూ ఖానా వస్తుంది. ఫికర్ నహి. నీ మొగ్డు యిప్డు ఢిల్లీమే ఖుశీగా వున్నాడు. జల్దీ వొస్తాడు. వాడ్ని తీస్కురావటాన్కి యుగందర్ మంతిరి ష్వయం వెళ్ళారు అని ఖబర్ వొస్తుంది.

ముస్త : అరె అల్లా. దీంట్లో యేదో మోసంవుంది. సందేహంలేదు. చాకల్ వాడ్కి వాపిస్ కోసం యుగందర్ మంతిరి ష్వయం వెళ్తారు! మనం రాజాగార్కి స్వయం దర్శనం చేసి, ఇక్డ వుండేది ప్రెతాపరుద్దర రాజు అవును లేదు సంగతి కన్పెట్టాలి !

నజీ : ఇప్పుడు రాజావారు ఎవరికీ చూసేదిలేదు. కాని వార్కి గాయాల్ మాన్తున్నాయ్. నాల్గయిదు దినాల్లో దర్బార్ చేస్తార్ అనుకుంటున్నారు సర్కార్.

ముస్త : జరూర్ పడితే నాల్లు దినాల్ కాదు. నాలు నెల్లు వుంటాం. రాజాకి ష్వయం చూడందె ఢిల్లీ వాపస్ నహీ.

నజీ : సర్కార్ ష్వయంగా రాజాకి చూడడం సులభంకాదు. రాజాకి దర్శనం కావాలంటే జనార్దన్ మంత్రి హుకుమ్ కావాల, విన్నాను.

ముస్త : హర్కత్ నహీ. జనార్దన్ మంత్రికి భేటీచేసి రాజాకి దర్శనం యిప్పించమని అర్జీ పెట్టుకుంటాం.

నజీ : జనార్దన్ మంత్రి హుకుమ్ యిస్తాడు నమ్మకంలేదు. ఆయన్కి చాలా అనుమానం. కబడ్దార్ వుండాలి. ఆయన్కి దూరం వుండడం మంచిది చెప్పారు, సర్కార్.

ముస్త : అరె ఫికర్ నహీ. జనార్దన్ మంత్రికి అనుమానం వుంది. మన్కి ఇంకా జాస్తి అనుమానం వుంది. జనార్దన్ మంత్రి ఒక్క కన్నుతో మన్కి పరేచ్చ చేస్తాడు. మన్మి రెండు నహీ, నాల్లు కళ్ళు పెట్కి చూస్తాం. మన్కి నక్కమాదిరి జిత్తుల్ వేస్తాం.

నజీ : జీహా. తమ్కి చాలా గొప్పబుద్దివుంది. సందేహంలేదు. లేకిన్ మనం వార్కి దేశంలో వున్నాం. వార్కి చేతిలో వున్నాం కన్క కబడ్దార్గావుండాలి చెప్పాను సర్కార్.

ముస్త : టీక్ హై. కబడ్దార్ వుంటాము. లేకిన్ బయం చేసేదిలేదు. జనార్దన్ మంత్రికి చూసి, మాకీ దర్శనం యిప్పించవాలా. జబర్దస్తీ చేస్తాము.

నజీ : యిశ్వాస్‌రావుకీ సల్లాతీసి, జనార్దన్ మంత్రికి చూసేది మంచిది సర్కార్. యిశ్వాసరావు మన్కి సహాయం చేస్తాడు చెప్పాడు.

ముస్త : అచ్ఛా, అచ్ఛా. మనం యిశ్వాస్‌రావుకీ సల్లాతీస్తాం. యిశ్వాస్‌రావుకీ యిల్లు నీకూ తెల్సు ?

నజీ : తెల్సు, సర్కార్.

ముస్త : ఛలో. ఆయన్కి భేటీచేసి.

నజీ : నేను అక్కడికి వొస్తాను. మీరు వహా యింట్కి రావొద్దు చెప్పారు సర్కార్.

ముస్త : యెప్డు వొస్తాను చెప్పాడు.

నజీ : వీలు చూస్కు వొస్తాను చెప్పారు.

ముస్త : అరె అల్లా. మన్కి కామ్ జరూర్. ఆయన్కి ఎప్పుడు వీలుకోసం మనం ఆగవాలా వీలులేదు. ఆయన్కి మనం తొందర చెయ్యవాలావుంది.

(పైన తలుపు తట్టిన చప్పుడు)

నజీ : యిశ్వాసరావు వొచ్చినట్టుంది సర్కార్.

ముస్త : బహుత్ అచ్ఛా. తీస్కురా.

(నజీర్ వెళ్ళి విశ్వాసరావుతో ప్రవేశిస్తాడు.)

నజీ : సర్కార్. యేహై యిశ్వాస్ రావుజీ : యిశ్వాస్‌రావుజీ, యేహై హమారా బడా సర్దార్ ముస్తఫాఖాన్‌జీ.

ముస్త : సలామ్.

విశ్వా : సలామ్.

ముస్త : కూర్చోండి. యిశ్వాస్‌రావుజీ.

(విశ్వాసరావు కూర్చుంటాడు)

ముస్త : తమరిది గొప్ప పేరు విన్నాని తమ్కి యింటికి వొచ్చి సలామ్ చెయ్యావాలా అన్కుంటే తమ్రే మా యింట్కి వొస్తారు చెప్పాడు నజీర్. తమరు మా యింట్కి వొచ్చారు. బహుత్ కుషీ.

విశ్వా : తమరిని కలుసుకోడమూ నాకూ సంతోష మే.

ముస్త : మాకి మీది ఒక్క సహాయం జరూరు కావాల యిశ్వాస్ రావుజీ.

విశ్వా : చెయ్యదగిన, చెయ్యగలిగిన సహాయమైతే అలాగే చేస్తాను.

ముస్త : తమ్కి చెయ్యలేని షహాయం కాదు. ఛోటా కామ్. బిల్‌కుల్ ఛోటాకామ్.

విశ్వా : చెప్పండి.

ముస్త : మాకి మీా రాజావార్కి దర్షనం చెయ్యవాలా వుంది. అది మీారు ఏర్పాటు చెయ్యవాలా.

విశ్వా : మా రాజావారితో మీాకేమిపని. ఎందుకు వారి దర్శనం ?

ముస్త : కాం కుఛ్‌నై. ప్రతాపరుద్దర రాజాసాహెబ్ బహుత్ దిల్ దారా రాజా విన్నాం. వార్కి ఈ కళ్ళతో చూస్తాం. ఈ చెవుల్తో వింటాం. ఫిర్ రాజావార్కి సుల్తాన్‌వారి సలామ్ చెబుతాం.

విశ్వా : మహారాజ దర్శనం ఏర్పాటు చేయించడం నా పని కాదు. అది జనార్దన మంత్రుల పని.

ముస్త : మీరు జనార్దన్ మంత్రికి జాస్త సిఫారస్ చేస్తే.

విశ్వా : సుల్తాను వారి సలాములు అందజెయ్య వొచ్చిన సర్దారులకి మహారాజావారి దర్శనానికి ఒకరి సిఫారసెందుకు. జనార్దన మంత్రిని కలుసుకొని మీ వొచ్చినపని చెప్పండి. సమయం కనిపెట్టి ఆయనే ఏర్పాటుచేస్తాడు.

ముస్త : అది చాలా ఆలష్యంగా కావొచ్చు మాకీ పనితొందరవుంది. జల్దీ భేటిచేసి ఢిల్లి వాపస్ వెళ్ళవాలా పనివుంది.

విశ్వా : ఈ విషయంలో నా శిఫారసు అవసరమూలేదు. దానివల్ల ప్రయోజనమూ ఏమీ వుండదు. మీకూ నాకూ అనవసర పరిచయం వున్నట్లు తెలిస్తే మీకూ నాకూకూడా ప్రమాదం. గోళ్ళతో పోయేకార్యానికి గొడ్డలి ప్రయోగించడం తెలివితక్కువతనం.

ముస్త : అచ్ఛా అచ్ఛా. మనదిస్నేహం బిల్‌కుల్ రహస్యం. జనార్దన్ మంత్రికి మేం స్వయంగా అర్జీ పెట్టుకుంటామ్.

విశ్వా : సరే, కాని ఆయన ఆవలిస్తే పేగులు లెక్కపెట్టగలడని మరిచిపోకండి.

ముస్త : మర్చిపోం.

విశ్వా : మరి వెళ్ళనా (లేస్తాడు) నావల్ల నేదో చాలా సహాయం కావాలన్నారు. ఇంతేనా నే చెయ్యవలసిన సహాయం ఇంకేమీ లేదుగా.

ముస్త : కుర్చోండి భాయీ. కూర్చోండి. మీ సహాయం పూరాగా కావాలి.

విశ్వా : చెప్పండి చల్లకొచ్చి ముంతదాచి ప్రయోజనంలేదు.

ముస్త : మీ రాజాగార్కి విషయంలో కొంత సందేహంవుంది.

విశ్వా : సందేహమా.

ముత్త : మీరు రాజాకి యీమద్దె తూశారు ? మాకు చెప్పండి:

విశ్వా : నేనూ రాజావారిదర్శనం ఇంకా చేసుకోలేదు. వేటలో గాయపడి, కోలుకొంటున్నారు. రాజసౌధంలో అంతరంగిక పరిచారకులకి, జనార్దన విద్యానాథులకితప్ప వయివా రెవరికి రాజదర్శనం లేదు.

ముత్త : యిద్యానాథుడు కోన్ హై.

విశ్వా : మంత్రి యుగంధరుల సోదర ప్రాయులట. మహావిద్వాంసులు. జ్యోతిషవేత్తలు. వేటలో గాయపడిన రాజుస్థితి గమనించి యుగంధర మహామంత్రికి చెప్పినవారు.

ముత్త : గాయాల్ తో వొచ్చింతర్వాత, మీరు ప్రతాపరుద్దర రాజావార్కి చూసిందిలేదు ?

విశ్వా : లేదు.

ముత్త : తర్వాతకూడా యెప్పుడు చూసిందిలేదు ?

విశ్వా : లేదు.

ముత్త : క్యాభాయి. మీరు కిత్నా బడా ఉద్యోగి! మీకిగూడా రాజాకి చూసేదాన్కి యీలు లేదు ?

విశ్వా : దానికేం. వైద్యులఆజ్ఞ. ఉల్లంఘించరానిది.

ముత్త : అయితే మీరు రాజాకి యెప్పుడు చూస్తారు భాయి. అస్సల్ చూస్తారు, లేదు ?

విశ్వా : ఎందుకు చూడను. ఆరోగ్యం కోలుకొని దర్బారు చేసినప్పుడు నాకు రాజదర్శనం తప్పదు.

ముత్త : జనార్దన్ మంతిరికి అన్నీ తెల్వాలి. మీకి యేమీ తెల్వకూడదు. జనార్దన్ మంతిరి మీ కంటె గొప్పవాడు వుండాలి. క్యా బాత్ హై, భాయీ.

విశ్వా : అవి మా అంతరంగిక విషయాలు. మీ కెందుకు ?

ముస్త : ఠీక్ హై. అవన్నీ మీకీ అంతరంగిక్ విషయాలు. మాకీ జరూరిత్ లేదు. ష్నేహంకన్క అడ్గినామ్. ఛమించాలి.

విశ్వా : సరే. ఈ మాటుకి క్షమించాము. ఇంతకీ మీకు కావలసిం దేమిటో తేల్చ లేదు.

ముస్త : మీరు రాజాకీ పరీచ్ఛగా చూసి, రాజా మే కుఛ్ ఫరక్ హైగా మాతో చెప్పాల.

విశ్వా : తీవ్రంగా గాయపడిన రాజులో కొంత బలహీనత ఎలానూ కనిపిస్తుంది.

ముస్త : అది కాదు భాయీ! అస్సల్ రాజు వున్నాడు లేదు. మీకు షందేహం వుంది, మాకీ చెప్పాలి.

విశ్వా : నాకు సందేహం ఎందుకు వుంటుంది ?

ముస్త : తమ్కి తెలిసే వుంటుంది. మీ రాజాకి బందీ తెచ్చాను ఢిల్లీకి అంటారు వజీరు వల్లీ ఖాన్. అది రాజా నహీ, చాకలి హై అని మా వజీర్ శికందర్ సాహెబ్ వారికి ఖబర్. నిజం క్యా హై తెల్సుకురావాల మా వజీర్ సాహెబ్ వారి హుకుం. దాన్కి కోసం మేము వొచ్చాం. మాక్కీ రాజాకీ భేటీ జల్దీ అవుతుంది లేదు. మీరు చూసి, నిజం చెప్పవాలా.

విశ్వా : సందేహ మేముంది. మీ వల్లీఖాన్ మా చాకలిని పట్టుకు పోయి ప్రతాపరుద్ర మహారాజే అని సుల్తాన్ వారికి చూపించినసంగతి మాకూ తెలుసు.

ముస్త : మీరు రాజాకి స్వయంగా చూసి, షందేహంలేదు. మా రాజా యిక్డేవున్నారు అని మాకీ చెప్పండి. అప్పుడు మాకీ నిజం నమ్మకం వొస్తుంది.

విశ్వా : యుగంధర మహామంత్రుల కృషి ఫలితంగా ఆ సంగతి మీ సుల్తాన్ వారికి ఢిల్లీలోనే తెలుస్తుందిలెండి.

ముస్త : దాన్కి ముందు మన్కి యిక్కడ తెలియవాలా. నిజం యేమ్టి తెలునుకోవాలా జరూరు.

విశ్వా : తెలునుకుని ప్రయోజనం ?

ముస్త : నిజం తెల్సుకోడానికి ప్రయోజనం, నిజం తెల్సుకోడం ఖాయీ!

విశ్వా : అలాగా, అంత నిష్కామ పరిశోధనా.

ముస్త : ఢిల్లీకి వచ్చుకుపోయింది చాకలి నిజం అయితే వాడికి విడిచి పెట్టేస్తాం.

విశ్వా : అది ఎలానూ తప్పదు. చాకలివాడిని రాజలాంఛనాలతో పోషించడం మీకే దండుగ.

ముస్త : రాజావార్కి ఛమాపణ చెప్పుకుంటాం.

విశ్వా : అదీ తప్పదు.

ముస్త : బస్. నిజం తెల్సుకోడానికి ప్రయోజనం చెప్పాం!

విశ్వా : ఇక్కడ కాకపోయినా, ఢిల్లీలోనైనా మీకు నిజం తెలియక పోదు కాని ఇక్కడే అనిజం తెలునుకోవలసిన అవసరం తేల్చ లేదు. సరేలెండి. అవసరం మీది. ఎంతవరకు విడమర్చి చెప్పగలరో అంతవరకే సహాయం చెయ్యగలను. రాజావారిని దర్శనం చేసుకున్న తరవాత నాకేమైనా సందేహాలుంటే మీకు తప్పకుండా చెబుతాను.

ముస్త : కోపం వచ్చింది కనబడుతుంది.

విశ్వా : కోపంకాదు. నిజమే చెబుతున్నాను. నా సహాయం కావాలన్నారు. మీ అవసరమేమిటో తెలిస్తేనేకాని, మీకు సలహా ఎలా చెప్పగలను. సహాయం ఏమి చెయ్యగలను. సరే, వెళ్ళివస్తాను.

ముస్త : అరెరె కూర్చోండి, భాయీ కూర్చోండి. (విశ్వాసరావు కూర్చుంటాడు) మేము ఢిల్లికి పట్కుపోయింది చాకల్ వాడు: ఇక్కడ రాజువున్నాడు అని మేము నమ్మేదిలేదు. ప్రెతాపరుద్దర్ రాజు ఢిల్లీలో బందీలోవున్నారు, మాకి నమ్మకం వుంది. ఇక్డ శాయద్ ఎవ్రూలేరు. నైతో, చాకలివాడికి దాచి, రాజు చెప్తారు. కన్కు మీకి అస్సల్ రాజుకి చూపించేదిలేదు. మాకి అన్మానంవుంది యిశ్వాసరావుజీ! మీరు తొందరచేసి, రాజాకిచూపించు పేచీపెత్తె అస్సల్ సంగతి బయల్ కి వొస్తుంది.

విశ్వా : దానివల్ల మీ కేమిలాభం.

ముస్త : తమ్కి నమ్మి సంగతి పూరా చెప్తున్నాన్ యిశ్వాన్‌రావుజీ! మాకి పూరా సహాయం చేస్తాను వాగ్దానం చెయ్యవాలా.

విశ్వా : అలాగే.

ముస్త : సుల్తాన్‌వార్కి హమారా వజీర్ వల్లిఖాన్ బహద్దర్‌పై బహుత్ విశ్వాస్ హై. ఇది చెడ్గొట్టుడాన్కి శికందర్‌ఖాన్ ప్రయత్నం చేస్తాడు. ఇప్పుడు రాజుకి తేలేదు. చాకల్కి తెచ్చాడు పుకార్ చెప్తాడు. సుల్తాన్‌వార్కి దిల్ మే సందేహంపెట్టి వార్కి మన్సు విరిచి గొప్ప అవుదాం చూస్తున్నాడు శికందర్. వాడ్కి కుట్ర సఫాచెయ్యకపోతే, వల్లిఖాన్ సఫా అయిపోతాడు. మన్కికూడా ప్రెమాదం. ఇక్కడ రాజు లేడు ఒక్వేళ వున్నాడు; వాడు రాజా నహి చాకల్ హై చెప్పేదాన్కి మీ మద్దత్ కావాలా!

విశ్వా : ఇదా సంగతి. దానివల్ల నాకు లాభం.

ముస్త : హమారా వల్లిఖాన్ బహదూర్ అబ్ జీత్ జాయెగా, వార్కి ఎవరూ అడ్డు వుండేదిలేదు. ఒడ్డుమనుసులు అంతా సఫా సఫా. వో ఖుద్ సుల్తాన్ బన్ జాయెగా వార్కి

మన్కు బడా వజీర్. మాకూ సహాయంచేస్తే, మీకీ బడా మంతిరి.

విశ్వా : సరే, ప్రయత్నిస్తాను.

ముస్త : మీకుస్తెల్చుకుంటే జరూర్ అవుతుంది.

విశ్వా : సరే, సరే. కాని మీకు ఒక్క సలహా. మీరు యీ నగరంలో వున్నట్టు జనార్దనుడికి యీపాటికె తెలిసివుంటుంది కనక అతనిని కలుసుకుని, చాకలిని ఢిల్లీ పట్టుకుపోయినందుకు మహారాజు దర్శనం చేసుకుని క్షమాపణ చెప్పకోడానికి వొచ్చామనీ, దర్శనం యిప్పించమనీ కోరండి. పట్టుకుపోయినది చాకలా, రాజా అన్న అనుమాన నివృత్తి కోసం వొచ్చినట్లు ఏ లేశమూ కనిపించకూడదు. చాకలినే పట్టుకుపోయినట్లు నమ్మకంగా తెలుసుకుని, క్షమాపణ కోరి నష్టపరిహారం యివ్వదలచినట్టు నచ్చేటట్టు చెప్పాలి. లేదా, జనార్దనుడు మిమ్మల్ని వెయ్యికళ్ళతో కనిపెడుతూనే వుంటాడు. మీ యెత్తులేమీ ఫలించవు. జాగ్రత్త.

ముస్త : తెల్సింది. మీరు మేము చెప్పినపని చేస్తారు ?

విశ్వా : చేస్తాను. సమయం కనిపెట్టిచేస్తాను. కాని నాతో సంప్రదించకుండా మీరేపనీ చెయ్యకూడదు.

ముస్త : జరూర్. మీసల్హాపైన తప్పకుండా నడ్చుకుంటాం.

విశ్వా : ఒక్క అడుగు తప్పువేశారా, మీ ప్రాణాలకి మొప్పం ! జాగర్త.

(అని వెళ్ళిపోతాడు)

ముస్త : నజీర్ !

నజీ : జీ సర్కార్.

ముస్త : యిశ్వాన్‌రావు చెప్పినట్టు మనం యిన్వాలా చెబుతాడు. వాడ్కి మన తజాఖా తెల్సినట్టులేదు.

నజీ : జీ సర్కార్.

ముస్త : వీడ్కి మనం ఉపయోగించి తర్వాత సఫా !

నజీ : అంతే సర్కార్.

ముస్త : వాడ్కి ఓకంట కన్నెట్టివుండాల నజీర్.

నజీ : జరూర్, సర్కార్.

ముస్త : మన్కు యివ్వు యెల్లికి కల్సుకోని, దాన్కి చేత పేచీ పెట్టించ వాలి నజీర్. దాన్కి యిల్లు నీకుతెల్సు చెప్పావు. యిల్లు చాలాదూరంవుందీ? దాన్కి యిక్కడ్కి తీస్కువొస్తావు నజీర్.

నజీ : దాన్కి యిల్లు దగ్గరవుంది; దూరంలేదు సర్కార్. లేకిన్ వొస్తుంది లేదు తెలియదు.

ముస్త : ఢిల్లినించి నీ మొగ్డుకి ఖబర్ తెచ్చాను చెప్పు. జరూర్ వొస్తుంది.

నజీ : మీకు మంచి వూహతట్టింది, జీహా. మొగ్డుకి ఖబర్‌చెప్తాము అంటె జరూర్ రావాల సర్కార్,

ముస్త : లోదాడో. ఛనంలో రావాల.

నజీ : అరఛనంలో వొస్తాను సర్కార్. (పరుగెత్తి వెళ్ళిపోతాడు)

ముస్త : ఢిల్లీమే రాజా బందీ.ఇక్డ గొడ్వల్ గొడ్వల్ హనుకున్నామ్ లేకిన్ యిక్డ బిల్‌కుల్ తక్లీఫ్ నై. రాజువున్నాడు లేదు, కిసీకో ఫికర్‌నై. శాయద్ చాకల్కి నిజం పట్కుపోయాం అనుమానంవేస్తుంది. తోబా తోబా. ఢిల్లీలో నిజంచాకల్ వుంటే మన్కి యిజ్జత్ పోతుంది. ప్రాణాల్‌కి బడా మోసం. దాన్కి

మందు వెయ్యాలా. అల్లా యెల్లిమన్కి చెప్పినమాట వింటుంది చెయ్యాలా!

(ఎల్లి, నజీర్ ప్రవేశం)

నజీ : యెల్లివచ్చింది సర్కార్.

ముస్త : బహుత్ కుషీకి బాత్ హై. ఆవో ఆవో. బైఠో.

ఎల్లి : మా వెట్టున్నడో ముంగల సెప్పరయ్యోయ్. ఆనక కూకుంటను!

ముస్త : మావ కోన్ హై.

నజీ : మొగ్గుకి మావ పిలుస్తుంది సర్కార్.

ముస్త : అచ్ఛా. మావ అంటే మొగ్గువున్నాడు.

నజీ : అందరు మామలూ మొగ్గులు లేదు సర్కారు. దీన్కి మొగుడు మామ.

ఎల్లి : తురక యెదవసచ్చినోళ్ళు నా మావనెందుకు అట్టుకుపోయినరయ్యోయ్. ఆడు మిమ్మల్నేం జేసిండు. మీ జోలి కెట్టి వచ్చిండు. మిమ్మల్ని తిట్టిండా, కొట్టిండా, యేం జేసిండు. మీరు ఆడిని యేంబాధలు పెడుతుండరో నా పేనం పోతుండది. సెప్పయ్యా. మావ ఎట్టుండడు?

ముస్త : గభరావో మత్ యెల్లి. నీ మొగ్గుకి కుఛ్ ఫర్వానహి. రాజా గార్కి బరాబర్ మర్యాదల్ జర్గుతున్నాయ్.

ఎల్లి : నా మావనెప్పుడు అంపేస్తరు. ఆడినేం జేస్తుండరు, అసలు ఆడు మీ కెందుకయ్యోయ్.

ముస్త : నీ మొగ్గు మాకు అవసరంలేదు. నీమొగ్గు తెలిసివుంటే వాడ్కి తీస్కుపోయేది లేదు. లేకిన్ వాడ్కి రాజు అనోక్కొని పట్కుపోయారు. రాజు మాఫిన్ ఖానాపీనా. సబ్ బందో

బస్తు హెూతా హై. నీ మొగ్గు మహారాజు బరాబర్ వుంటారు విన్నాను. అది నీకు తెల్సేదిలేదు.

ఎల్లి : నాకుతెల్సు. నా మావ నారాజేగ.

ముస్త : వోనై. చూసేందుక్క పెతాపరుద్దర మహారాజు బరాబర్ వుంటారు.

ఎల్లి : వో మావా నీకు రాజుగారి బట్టలువేస్తే, నువ్వె రాజంటువు అని నేనె అంటును. దిష్టి తీస్తును.

ముస్త : దిష్టి క్యా హై ?

ఎల్లి : నీ లాటివోళ్ళ కళ్ళుపడి, పెమాదం రాకుండ తీస్తును.

ముస్త : ఏమ్టి తీ స్తవు.

ఏల్లి : మిరపకాయలు.

ముస్త : అరె అల్లా. మిర్పకాయలు ! క్యా,

ఎల్లి : తురకోడికి నే చెప్పలేనురోయ్. నా మావ చెప్పుది స్తవా? నువ్వు చెప్పు !

ముస్త : ఒకే దుస్తుల్ తొడ్గి, పెతాపరుద్దర రాజుకీ నీ మొగ్గుకి వక్క వక్కల్ నిల్పెడితే నీ మొగ్గుకి గుర్తుపెడ్తావ్ ?

ఎల్లి : యేటయ్యా. యెట్టంటి బట్టలు యేసుకున్న నా మావని నేను పట్టుక సూపియ్యగల్నురోయ్.

ముస్త : నీమావ అన్కోని రాజుకి నువ్వు పట్కుంటే నీకియేమ్టిగుర్తు.

ఎల్లి : అదిచెప్పిందుకుకాదు. నామావని నాకిచ్చెయ్యండయ్యోయ్.

ముస్త : అది రహస్య ప్రదేశంలో వుంది !

ఎల్లి : తురకముండావోడ. అయ్యన్ని నీ కెందుకురా. నా మావని నా కిచ్చెయ్యరోయ్.

ముస్త : నువ్వు మావకి యెట్లు కన్పడ్తావ్. మాకు చెప్తేకాని, నీకు వాపస్ యిచ్చేది కైసా.

ఎల్లి : నే కితకితలెత్త. మావ నవ్వావుకో లేదు యిరగబడినవ్వుతడు. నా మావని చూపించరోయ్.

ముస్త : అచ్ఛా. వో హై నీకి గుర్తు. నీకి మొగ్గు కావాలవుంటె మన్కు చెప్పినట్లు రహస్యం వుంచవాల. వుంచుతావు.

ఎల్లి : వుంచుతను.

ముస్త : ఠీక్. నువ్వు నీమొగ్గు గాయబ్ అయిం తర్వాత రాజా గార్కి దర్శనంచేసిందిలేదు.

ఎల్లి : లేదు.

ముస్త : మన్కు చెప్పింది చేస్తే, నీకి మొగ్గు జల్ది వాపస్ వొస్తాడు.

ఎల్లి : చెప్పయ్యా, చెప్పు. చేస్తును.

ముస్త : నువ్వు మొదల్ రాజాకి భేటీ అడు. ఇక్డ రాజా నీమొగ్గు వున్నాడు లేదు. కన్పెట్టి నాకే చెప్పు.

ఎల్లి : నామావ ఢిల్లీలో వున్నడు. యుగంధర మంత్రి చెప్పిండు.

ముస్త : అది నిజంలేదు. నాకు మాన్మానంవుంది. నీ మొగ్గుకి యిక్డ దాచి ఢిల్లీమే వున్నారు చెప్తారు తోచింది.

ఎల్లి : నా మావ, యీ వూళ్లో వుంటె బందిఖానాలో వున్నకూత లగెత్తుకు నాదగ్గరికి వొచ్చుండు. ఈవూళ్ళోలేదు. ఢిల్లీలో వున్నడు. నా మావని నాకిచ్చెయ్య రయ్యోయ్.

ముస్త : ఛిల్లావోమత్, మన్కి చెప్పింది యిన్కపోతే నీ మొగ్గుకి ప్రెమాదం. (పీక తెగిపోతుందని నటించి చూపిస్తాడు)

ఎల్లి : అయ్యల్లోయ్. నీ పాదలట్టుగుంట. నా మావకి పెమాదం వొద్దు. నువ్వు చెప్పింది యినుకుంట?

ముస్త : బరాబర్ యాద్‌రఖో. మన్కి చెప్పింది నువ్వు యిన్వు, ఆ ఛనం నీ మొగ్డుకి పెమాదం మిర్పకాయల్, గిర్పకాయల్, దిష్టి సే తప్పించేందుక్ నహి.

ఎల్లి : వింటను. తురకయ్యోయ్. వింటను నువ్వు చెప్పింది చేస్తను.

ముస్త : బహుత్ అచ్ఛ. తబ్ నీ మొగ్డు జల్ది నీకి వాపస్.

ఎల్లి : ఏం చెయ్యల చెప్పయ్య!

ముస్త : నీకి కష్టంలేనిపని జనార్దన్ మంత్రికి తచ్ఛనంచూసి, నాకి రాజాకి దర్శనం జరూరుకావాల చెప్పు. దర్షనం అయేవర్కు యింటికి వెళ్ళేదిలేదు చెప్పు.

నటి : వార్కి దగ్గర కూచోని, జోరు, జోర్సే యేడ్వాలి. నహీతో నీకు రాజాకి దర్షనం యిచ్చేదిలేదు.

ముస్త : రాజాకి దర్షనం చేసినప్పుడు బరాబర్ దేఖో. నీకి రహస్యం గుర్తు దేఖో. కిత్‌కితాపెట్టి, నీమావ అవును లేదు. ఫిర్ మాకిచెప్పు, దోదిన్‌మే నీ మొగ్డు నీయింటో వాపస్.

ఎల్లి : అట్టగె నయ్యోయ్, నువ్వు చెప్పినట్టు చేస్తను. నామావనేం జెయ్యకు.

ముస్త : లేకిన్ యీసల్ల మన్కి చెప్పాం. దూస్రా యెవరికి చెప్పేది కూడదు. చెప్తే నీ మొగ్డుకి అక్డ, నీకి యిక్డ, ప్రెమాదం,

ఎల్లి : ఎవరికి గని చెప్పను.

ముస్త : తబ్ జావ్. రాజాకి దర్షనం చేస్కోని వాపస్ ఆవ్. నీకి పైసా కావాలి చెప్పు మాకి.

ఎల్లి : నీపైసలు నా కెందుకయ్యోయ్. దండిగ నా దగ్గరున్నయ్. నా మావని నా కిచ్చేస్తై, నే నిస్తును పైసలు నీకు!

ముస్త : వహావ్వా, నువ్వు బహుత్ అచ్ఛా ఔరత్ హైా. మాకి బడాయిష్టం అయింది.

ఎల్లి : నీ యిష్టం నీ బీబీ మీద చూపిచ్చుకో. నా కొద్దురోయ్ తురకాడ.

నజీ : నీకి వొల్లు దగ్గరపెట్కో మాట్లాడు.

ఎల్లి : మీ వొల్లు మీ దగ్గిరెట్టుకు మాట్టాడితె, నావొల్లు నాదగ్గిరె వుంటుదిరోయ్.

ముస్త : గుస్సాక్ బాత్ నై, నీకి మా పహాయం వుంది. మాకి నీ పహాయంవుంది. మీకీ మాకీ స్నేహంవుంది. జగడాలేదు. దీన్కి మర్చిపోకు, నజీర్‌ఖాన్, యెల్లికి ఘర్ మే యిడ్చిపెట్టి జల్దీ వాపస్ ఆవ్.

ఎల్లి : నాకు ఈ సాయిబయ్య ఎంటొద్దు.

ముస్త : మల్లీ మన్కి భేటీ, నజీర్ నీకి వాకబ్ చేస్తాడు?

ఎల్లి : తురకోడు యింటికొస్తై తంటు. నేనె వచ్చి చెబుతును యీడిని అంపకు.

(అని వెళ్ళిపోతుంది)

నజీ : యెల్లికి నోరు మంచిదిలేదు సర్కార్.

ముస్త : లేకిన్ తెల్వివుంది కన్పడుతుంది నజీర్. దీన్కి రెండు కళ్ళు కన్పెట్టివుండాలా తోస్తుంది నజీర్.

నజీ : జీ హాఁ.

ముస్తా : తో కస్పెట్టి వుండు.

(నజీర్‌ఖాన్ సలామ్‌పెట్టి బయటికి వెళ్ళిపోతాడు.)

ముస్తా : యిశ్కాన్‌రావు; యెల్లి యీ రెండుమనుష్యుల్కి పెట్టి మన్కు కామ్ షురూ చేశాము. అల్లా, నీకి కటాచ్ఛం మాకి వుంటే, దేఖో, మన్కి తడాఖా. దుష్మన్ సబ్‌కీ, సఫా సఫా.

(అని దురుసుగా వెళ్ళిపోతాడు.)

( తెర )

# మూడో అంకం

[దర్బారుగది : జనార్ధనుడు ఒక్కడూ పచారు చేస్తూ వుంటాడు. ]

జనా : పేరిగాడికి శిక్షణ పూర్తి అయింది. పేరయ్య ప్రతాపరుద్రుడై దర్శన మివ్వగలడు. ఈ రోజున దర్బారు చేయించమని విద్యానాథుల ఆదేశం. ఒకమారు ఆంతరంగికంగా దర్బారు జరిపి ఫలితం పరీక్షించినతరువాతనే బహిరంగ దర్బారు ఏర్పాటు చెయ్యడం మంచిదేమోనని నే సందేహం వెలిబుచ్చినా అవసరంలేదన్నారు. వా రెంత ధైర్యమిచ్చినా, నాకు గుండె నిబ్బరం కలగడంలేదు. సభ వేగులవారితోటే ఏర్పాటుచేశాను. వ్యవహారం తిన్నగా నడవకపోతే పైవారికి ప్రవేశం రద్దు. బెడిసినా ప్రమాదంలేదు. విద్యానాథులవారి కిది కోపకారణమేమోగాని రాచకార్యాలు వారికి కొత్తగదా ! అదనున క్షమాపణ చెప్పుకోగలను.

(సైనికుడు ప్రవేశం.)

జనా : అన్నిద్వారాలవద్దా సైన్యం కాపలా వుందా ?

సైని : చిత్తం.

జనా : సభ ప్రారంభించినతరువాత సంకేతవాక్యం చెప్పనివారికి ఎవరికీ నా అనుమతిలేక లోనికి ప్రవేశంలేదు.

సైని : చిత్తం. చాలా సేపటినించి ఢిల్లీసుల్తాన్ వారి సర్దార్ ముస్తఫా ఖాన్ తమ దర్శనానికి వేచియున్నాడు. ప్రవేశపెట్టమని శలవా ?

జనా : బెడద ప్రారంభమయింది. నా జాగర్త అనవసరం కాదన్న మాట. సరే రమ్మను.

(నౌకరు బయటికి వెళ్ళుతాడు. ముస్తఫా ప్రవేశించి సలాముచేస్తాడు.)

ముస్త : జనార్దన్ మంత్రి చాలా గొప్ప మంత్రి అని ఢిల్లీలోకూడ తమ్కి చాలా పేరు. ఈరోజు తమ్కి దర్శనం చేస్కున్నాం. మాక్ బహుత్ కుషీఅయింది.

జనా : కూర్చోండి, కూర్చోండి. (ఉభయులూ కూర్చుంటారు) తమరిని కలుసుకున్నందుకు నాకూ చాలా ఆనందంగానే వుంది. ఈ ప్రాంతాలకి తమ రేపనిమీద విచ్చేసినట్టు.

ముస్త : ఖాస్ పని లేదు.

జనా : పని లేకనే యింతదూరం పనిగట్టుకు వొచ్చారా.

ముస్త : ఖాస్ పని లేదు చెప్పితే అసల్ పని లేదు అర్థంకాదు. సులభం పనివుంది.

జనా : మిమ్మల్ని ఇక్కడికి రప్పించిన ఆ సులభమైన పని ఏమిటో !

ముస్త : పని సులభం, కాని గొప్పదివుంది. కన్క సుల్తాన్ వారు నాకి పిల్చి, ముస్తఫాఖాన్ నువ్వు ష్వయంగా వెళ్ళు అని హుకుమ్ యిచ్చినార్.

జనా : అయితే శలవివ్వండి ఆ పనేమిటో.

ముస్త : మా సల్తాన్ వార్కి మీ రాజావార్తో స్నేహం కలపాల్. చాలాదినాల్ కోరికవుంది,

జనా : హర్షించదగిన కోరికే.

ముస్త : కన్క తమరు ఒక్కమాటు ఢిల్లీ దయచెయ్యాల రాజావార్కి కోరవాల అని మా సుల్తాన్ వారి హుకుమ్.

జనా : సుల్తాన్ వారితో స్నేహం చెయ్యడానికి మా రాజావారు ఢిల్లీ రావాలా. ఇదేమి కోరిక.

ముస్త : మాసుల్తాన్ వార్కి స్నేహం ముఖ్యం. అది ఢిల్లీలో నహితో వరంగల్లో. దోస్తీమే మా యింట్కి మీరు, మా యింట్కి మేము. రాజావార్కి ఢిల్లీ రావడం యిష్టంలేదు; సుల్తాన్ వారు వరంగల్ వొస్తారు.

జనా : ఏమైనా స్నేహం మాత్రం తప్పదంటారు. అందుకనే కాబోలు మాసీమలో రహస్యంగా జొరబడి మా చాకలి వానిని బందీగా పట్టుకు పోయింది. స్నేహం చేస్తేనేగాని మీ చాకలివాని ప్రాణాలు తీస్తామని బెదిరించటానికి కాబోలు ఈ రాయబారం.

ముస్త : భూల్ హుయి. సుల్తాన్ వార్కి ఖుశీచేస్తామని బుద్ధిలేనిసర్దార్ ఆ పనిచేసినాడు తెలిసింది. సుల్తాన్ వార్కి గుస్సా వొచ్చింది. ఖరాబ్ పని చేసినారు అని తిట్టినారు. రాజావార్కి ఛమా పణచెప్పి, స్నేహంచెయ్యవాలి కోరుతున్నారు.

జనా : తప్పు తెలుసుకున్నప్పుడు మా చాకలిని తిరిగి మాకు అప్ప జెప్పడం మీవిధి.

ముస్త : చాకల్కి తప్పకుండా వాపస్ చేస్తాం మంత్రిజీ. రాజాగార్కి చాకల్ కి, రాజూలా మర్యాదచేస్తున్నాం. మర్యాదచేసి వాపస్ చేస్తాం. లేకిన్ శిరఫ్ వాపస్ చేస్తే సుల్తాన్ వార్కి దిల్ ఠండా అయ్యేదిలేదు. రాజావార్కి స్నేహం కావాల.

జనా : మీ సుల్తాన్ వారితో స్నేహం చేసుకోవాలన్న ఆత్రుత

మా రాజాగారికి లేకపోవొచ్చును, స్నేహానికి బలవంత మేమిటి?

ముస్త : బల్వంతం లేదుకాని, మా సుల్తాన్‌వారు బహుత్ అచ్ఛా సుల్తాన్. మీ రాజావారు ఒక్కమాటు భేటీచేసి మాట కలిపివుంటే స్నేహం విడ్చిపెట్టేదిలేదు. తమ్కి అజ్ఞ సుల్తాన్ వార్కి వోరంగల్ రమ్మంటే ఖుశీగా వొస్తారు.

జనా : వొద్దొద్దు. సుల్తాన్‌వారు అంత శ్రమ పడవలసిన అవసరం లేదు. దేనికైనా కాలం, కర్మం కలిసిరావాలంటారు. రాజు గారితో సంప్రదించి సుల్తానువారికి కబురుచేస్తాం.

ముస్త : రాజావార్కి దర్శనం చేస్కుని మా సుల్తాన్‌వార్కి కోర్కె అందజేస్తాం. వార్కి భేటీ యిప్పించమని మాకీ అర్జీ.

జనా : ప్రస్తుతం రాజుగారి దర్శనం, బహుశా అసంభవం.

ముస్త : రాజుగారు దేశంలో లేరు?

జనా : లేకేం, వున్నారు. వేటలో తగిలిన గాయాలనించి కోలు కొంటూ విశ్రాంతి తీసుకుంటున్నారు.

ముస్త : గాయాల్ తగిలినయ్. బడా అఫ్‌సోస్ కి బాత్. సుల్తాన్ వార్కి వింటే చాలా విచారం పడ్తార్. రాజాగార్కి దర్శనం చేసి, మాకీ సలాం చెప్పి ఛమాపంచెప్పి, రాజాగార్కి గాయాల్ తగ్గినందుకు సుల్తాన్‌వారి విచారం చెప్పి, వారి స్నేహం కోరిక చెప్పి అరఘనంలో మేము యెళ్ళిపోతాం. మా భేటీ వార్కి యేమీ శ్రమ వుండదు.

జనా : వైద్యుల అజ్ఞ ఉల్లంఘించడానికి వీలులేదు. వారి దర్శనం లభించడానికి మరికొంతకాలం పట్టవచ్చును. కేవలం యీ సందేశం చెప్పడానికి మీరు అనవసరంగా పని చెడువుకుని వరంగల్‌లో వుండవలసిన అగత్యంలేదు.

ముస్త : మస్కి వేరుపని యేమీలేదు జనార్దన్ మంత్రిజీ. సుల్తాన్ వార్కి కోరిక మాకి హుకుమ్. రాజావార్కి చూసి, సందేశం చెప్పు అన్నారు సుల్తాన్‌వార్. రాజావార్కి సూద్దం మాకి అస్సల్‌పని. దూస్రా పనిలేదు. ఇక్కడవుండి రాజావార్కి చూసి, ఫిర్ వాపస్.

జనా : వారికి స్వస్థత చేకూరి దర్శనమిచ్చేందుకు కొన్ని వారాలు పడితే.

ముస్త : హర్ కత్ నై. తొందర్గా యిప్పిస్తే, తొందర్గాపోతాం. అవసరంఅయితే వారాల్ వుంటాం.

జనా : అంతేగాని రాజుగారి దర్శనంకానిదే కదలనంటారు. అది మీ యిష్టంలో లేదని మరిచిపోకండి.

ముస్త : మా యిష్టంకాదు మంత్రిజీ. తమ్కి చిత్తం, మర్చిపోం. లేకిన్ ఢిల్లీ సుల్తాన్‌వారు స్నేహం చేస్తాం అంటే నకో అనేది మంచిది లేదు. తమరు మర్చిపోకూడదు జనార్దన్ మంత్రిజీ.

జనా : మీ హెచ్చరింపుకి కృతజ్ఞుణ్ణి. మరిచిపోను.

ముస్త : అయితే రాజావార్కి భేటీ చేసి.

జనా : ఆలోచించి కబురుచేస్తాను.

ముస్త : మాకి తెల్సింది, యీరోజు రాజావారు దర్బారు చేసేది వుంది. యీరోజు దర్బార్‌కు మాకి దర్శనం యిప్పించాలి కోరతాం. మాకి రెండుధనాల్ చాలు.

జనా : అర్థమయింది. పదిమాట్లు చెప్పవలసిన అవసరంలేదు. సమయం కనిపెట్టి సంగతి చూస్తాం.

ముస్త : ఈ దిన్మే.

జనా : సరే సరే. వీలయితే ఈ రోజునే.

ముస్త : మేము మీ పిల్పుకోసం వేచివుంటాం.

జనా : అలాగే.

ముస్త : తో, సలాం జనార్దన్ మంత్రిజీ, సలాం!

జనా : సలాం. సలాం.

(ముస్తఫా వెళ్ళిపోతాడు.)

జనా : ఎవరురా అక్కడ.

(సైనికుడు ప్రవేశం.)

భేతాళరావుగారిని సత్వరం రమ్మను. (సైనికుడు వెళి పోతాడు.) ముస్తఫా రాక, సుల్తాన్ సందేహాన్ని సూచి స్తోంది. రాజుని ప్రదర్శించమని యీ విధంగా ఒత్తిడి, యుగంధురుల వారినించి ఇంకా కబురులేదు—సూచనలేదు.

(భేతాళరావు ప్రవేశించి నమస్కరిస్తాడు. జనార్దనుడు ప్రతి నమస్కారం చేస్తాడు.)

జనా : రాజదర్శనం కోసం ముస్తఫా వేచిఉన్నాడు. వాడి అచోకి ఏమైనా తెలిసిందా ?

భేతా : వల్లిఖాన్ అంతరంగికుడు. ఢిల్లీకి పట్టుకుపోయినది రాజా, చాకలా అన్నది నిర్ధారణచేసుకుని రమ్మని పంపగా వచ్చినాడు.

జనా : ఎందుకింత ఆత్రుత !

భేతా : తెలివితక్కువపని చేసినందుకు పరస్పర నిందలు. సుల్తాను పరివారంలో చీలికలు. అంతఃకలహాలు.

జనా : తెలిసింది. కనకనే అపాయమని తెలిసికూడా రాజదర్శనానికి అంతపట్టుదల. ముస్తఫా జారిపోకుండా....

భేతా : ప్రమాదంలేదు. అవసరమయినప్పుడు పట్టి బందీ చెయ్యమని ఈవరకే అజ్ఞ యిచ్చాను.

జనా : సంతోషం. ఈ నాటిదర్బారుకి ఇంకా ఎందరుతోసుకు రానున్నారో. వేగుని ద్విగుణీ కృతం చేయించు.

భేతా : చిత్తం. (అని వెళ్ళిపోతాడు.)

జనా : నా సన్నాహాలన్నీ సిద్ధం. పేరయ్యస్థితిఏమిటో. అనుమయ్యా.

(అనుమయ్య ప్రవేశిస్తాడు.)

జనా : అయ్యగారేరీ?

అను : ముస్తాబై అందిలో తయారుగా వున్నారు.

జనా : విద్యానాథులుకూడా వున్నారా!

అను : లేదు. ఒక్కరే వున్నారు.

జనా : నేను వొచ్చాను. రమ్మనిపిలు.

అను : విద్యానాథులు వొచ్చి పిలుస్తేనేగాని బయటకిరానని అందరికీ చెప్పమన్నారు.

జనా : అలాగా. నేనే లోపలికి వెళ్ళి పలకరిస్తాను అయితే.

(అని గదివైపు నడవబోతాడు.)

అను : (అడ్డుతగిలి) క్షమించాలి. విద్యానాథులని తప్ప ముందు ఎవరినీ తమవద్దకు రానివ్వొద్దన్నారు.

జనా : నన్నుకూడా రానివ్వొద్దని అజ్ఞా!

అను : సేవకుడిని, క్షమించాలి. తమరినికూడా రానివ్వొద్దని అజ్ఞ.

జనా : ఎంతధైర్యం. దీనికికారణం ?

అను : దీక్షపట్టాను. విద్యానాథులవారు వొచ్చి ఆ దీక్ష విడగొట్టాలన్నారు.

జనా : దీక్ష; విద్యానాథులని పిలుచుకురా.

అను : (పైకి వెళ్ళబోతూ) వారే వొస్తున్నారు.

(సరస్వతీ ప్రార్థనశ్లోకం చదువుతూ విద్యానాథుడు ప్రవేశం.)

జనా : అభివాదం మహాకవీ.

విద్యా : విజయోస్తు. రాజుగారి ముస్తాబు పూర్తిఅయి తయారుగా వున్నారా.

అను : వున్నారు. తమకోసమే యెదురు చూస్తూ వున్నారు.

జనా : దీక్షపట్టాను. మిమ్మల్నితప్ప ఎవరినీ తన గదిలోకి రానివ్వ కూడదని ఆజ్ఞ యిచ్చారుట. మీరే వెళ్ళి ఆ దీక్ష విడిపించుకు తీసుకురావాలి. వెర్రిచేష్టలు పోయినట్టు లేదు.

విద్యా : (చిరునవ్వుతో) దీక్షపట్టి ఏకాగ్రత సాధించడం వెర్రిచేష్టలు కాదు జనార్దనా (అనుమయ్యతో) నేనొచ్చి, దీక్ష విడిపించి తీసుకొస్తాను. నువ్వు అక్కడే వుండు.

(అనుమయ్య లోపలికి వెళ్ళిపోతాడు.)

గాభరా పడవలసిన అవసరంలేదు జనార్దనా.

జనా : తమ ప్రతిభ నే నెరుగనిదికాదు కాని, ఒకమాటు అంతరంగికంగా దర్బారు జరిపితే క్షేమమేమోనని మరోమారు మనవి చేసుకుంటున్నాను.

విద్యా : అవసరంలేదు. బహిరంగంగానే దర్బారు జరపవొచ్చును.

జనా : మనవారే కాదు ఢిల్లీనించి సుల్తాన్‌వారి వజీర్, ముస్తఫాఖాన్ కూడా ఈ నాటి దర్బారులో దర్శనానికి వేచి ఉన్నాడు.

విద్యా : అభ్యంతరంలేదు. తప్పకుండా దర్శనానికి పిలిపించండి.

జనా : తమ ఆజ్ఞ.

విద్యా : నా ఆజ్ఞకాదు. యుగంధరామాత్యుల ప్రతిభ,

జనా : నా సందేహ దౌర్బల్యాన్ని క్షమించాలి. పేరయ్య రాజఠీవి ప్రదర్శించవచ్చును గాని తాను ప్రతాపరుద్ర మహారాజునే నని పరుల కేవిధంగా స్వయంగా చెప్పగలడు!

విద్యా : తన మేలుకోసం యెల్లి ప్రాణసంరక్షణార్థం తానే ప్రతాప రుద్ర మహారాజునని పరులయెడకు ప్రవర్తించి, వారిని పరిభ్రమింప చెయ్యాలని నా ఆదేశం. ఆ విధంగా తానే ప్రతాపరుద్ర మహారాజై ప్రవర్తిస్తాడని మన గౌరవం, రాజ కుటుంబ గౌరవం, దేశ ప్రతిష్ఠ కాపాడతాడని నాకు విశ్వాస ముంది. ఇది చరిత్రలో మున్నెన్నడూ కనివిని యెరుగని పరివర్తన. కాకతీయ సామ్రాజ్యానికి శ్రీరామ రక్ష. యుగంధరామాత్యుల ఆశీస్సు ప్రభావం. దీక్షవిడిపించి వొస్తాను.

(లోపలికి వెళతాడు.)

జనా : (మోకరించి) యుగంధరా! మీ ఆత్మవిశ్వాసం నాలో కూడా కొంత ప్రవహింపచెయ్యండి.

(సైనికుడు ప్రవేశించి)

సైని : జయము జయము జనార్దనమంత్రికి. తమ దర్శనంకోసం విశ్వాసరావుగారు దయచేశారు.

జనా : రమ్మను.

(జనార్దనుడు వెళ్ళి కుర్చీమీద కూర్చుంటాడు. విశ్వాస రావు ప్రవేశం.)

జనా : కూర్చో. క్షేమమా?

విశ్వా : మేము క్షేమమే. మహారాజుల దర్శనభాగ్యంలేక, వారి క్షేమం తెలియకే ఆతురతగా వుంది.

జనా : వారు పూర్తిగా ఆరోగ్యం కోలుకున్నట్టే.

విశ్వా : సంతోషం.కాని అంతరంగికులకు మాకూ వారి దర్శనం యింతవరకూ లభించకపోవటం ఆందోళనకరంగా వుంది.

జనా : ఆందోళన అనవసరం.

విశ్వా : ఆందోళన వారి ఆరోగ్యాన్ని గురించే కాదు. మమ్మల్ని దూరంగా వుంచుతున్నారే అని.

జనా : (తీక్ష్ణంగా చూస్తూ) వైద్యుల ఆజ్ఞ ఉల్లంఘించరానిది కదా! కేవలం నిన్నుమాత్రం దూరంగా వుంచలేదు. నేను మహారాజుని దర్శించి నాలుగు వారా లయింది.

విశ్వా : వార దర్శనభాగ్యం మా కింకా యెంతకాలానికో!

(మాటలో విద్యానాథుడు ప్రవేశం.)

విద్యా : ఈ రోజునే!

(జనార్దనుడు, విశ్వాసరావు లేచి విద్యానాథుడికి నమస్కరిస్తారు.)

విద్యా : (విశ్వాసరావుతో) కుశలమా?

విశ్వా : తమదయవల్ల.

విద్యా : ఆ యుగంధర మహామాత్యుల ప్రతిభవల్ల ననండి.

విశ్వా : దానికి సందేహంలేదు.

జనా : రాజదర్శనం కాకుండా నేను ఆపివుంచుతున్నానేమోనన్న అనుమానం విశ్వాసరావుకి కలిగింది. నా అదృష్టం బాగుంది. ఈనాడే వారికి రాజదర్శనం లభిస్తుందని తమరు శెలవిచ్చారు.

విద్యా : నీమీద అనుమానమా. ఇది తగని పరిణామం విశ్వాసరావూ!

విశ్వా : క్షమించాలి నాకు కలిగినది అనుమానంకాదు, ఆత్రుత.

విద్యా : ఈనాటితో సందేహాలన్నీ సమసిపోతాయి. సభ ఉపక్ర మించవచ్చును. మహారాజుని తోడ్కొని వొస్తాను వైణి కులని పిలిపించి సిద్ధం చేయించు.

(లోపలికి వెళ్ళిపోతాడు)

జనా : సేవకా! వైణికులని రమ్మను. కూర్చో విశ్వాసరావు.

విశ్వా : అనుమరెడ్డికూడా ప్రభువువారి దర్శనానికి ఆత్రుతతో వేచి ఉన్నాడు. అతనిని కూడా పిలుచుకురానా.

జనా : తప్పకుండా.

(విశ్వాసరావు వెళ్ళిపోతాడు. వైణికుడు, మార్దంగికుడు, మరికొంతమంది ప్రేక్షకజనమూ ప్రవేశించి కూర్చుంటారు. తరువాత సేవకుడు ప్రభూ యిటు, యిటు అంటూవుంటే రాజ వేషంలో పేరయ్య, వెనక విద్యానాధులు ప్రవేశం. అందరూ లేచి నుంచుని అభివాదం చేస్తారు. పేరయ్య ఏమిచెయ్యాలో తెలియనట్టు నిల్చునిపోయి, విద్యానాధుడికేసి చూస్తాడు.)

విద్యా : ప్రభువువారు సింహాసనముమీద ఆసీనులు కావాలి.

(పేరయ్య వొంగి విద్యానాధుడి కాళ్ళు తన కళ్ళ నద్దుకుంటాడు.)

విజయోస్తు. ప్రభూ! విజయోస్తు.

(పేరయ్య వెళ్ళి ఠీవిగా సింహాసనంమీద కూర్చుంటాడు. జనార్దన ప్రభృతులు ఇంకా నించునే వున్నారు, జనార్దనుడిని చూసి, కన్నుగీటి ఒక్కొక్క అక్షరం పలుకుతూ)

పేర : కూర్చుండుము జనార్దనా, కూర్చుండుము.

(ఉచ్చారణ స్వచ్ఛంగా వుంటుంది.)

జనా : (నిర్ఘాంతపోయి) చిత్తం. (కూర్చుంటాడు)

పేర : గురుదేవా, తమరు

విద్యా : కూర్చుంటాను (కూర్చుంటాడు)

పేర : మిగతా అందరూకూడా కూర్చోవచ్చును.

విద్యా : జనార్దనా. ఇక కార్యక్రమానికి ఉపక్రమించ వచ్చును. ప్రభువువారు సిద్ధంగానే వున్నారుగదా !

పేర : అవును.

జనా : వీణావాదనతో సభ ప్రారంభిద్దామా.

పేర : సరే.

(వైణికుడు శ్రుతి సరిచేసుకుంటాడు. పేరయ్య నిశ్చలంగా కూర్చుంటాడు.)

వైణి : ప్రారంభింపమని శలవా.

పేర : అభ్యంతరం లేదు.

వైణి : ఏమి వాయింపమని తమకోరిక.

(పేరయ్యకి ఏమి చెప్పాలో తెలియక ఒక్కక్షణం విద్యానాథుల కేసి చూస్తాడు. విద్యానాథుడు జవాబు చెప్పమని తలవూపి హెచ్చరిస్తాడు.)

పేర : ఒక చక్కని కీర్తన వాయించండి.

వైణి : (చిరునవ్వుతో) చిత్తం.

(ఒక కీర్తన వాయిస్తాడు. ప్రేక్షకులు అప్పుడప్పుడు వహవ్వా అంటారు. వాయిస్తున్నంతసేపూ, చిరునవ్వు తప్ప చలనం లేకుండా వింటాడు పేరయ్య.)

వైణి : (ముగించి) ప్రభువువారికి నచ్చినట్టు లేదు.

పేర : నచ్చినది. చాలా బాగున్నది.

వైణి : మరి యొకటి వాయింపుమని శలవా?
పేర : సమయమున్నదా జనార్దనా?

(జనార్ధనుడు ఈమాటు నిజంగా చకితుడైపోతాడు. కొంత హర్షంతో)

జనా : లేదుప్రభూ. చాలా కార్యక్రమముంది. సేవకా! గాయకులని ప్రవేశపెట్టు.

(గాయకులు ప్రవేశిస్తారు. రాజుకి దండంపెట్టి కూచుంటారు.)

గాయ : ఉపక్రమింపమని శలవా!
పేర : పాడండి.

గాయ : మా యత్త, మా యత్తగారు
నన్ను దోలుక పో వొచ్చినారు,
ఊళ్ళోనున్న ఓ కుమ్మరయ్యా
పచ్చికుండలు ఎదురంగదేరా.
ఊరుతిరిగె ఓ జంగపిల్లి
దోవకడ్డంగ నువ్వన్నచావె.
ఊళ్ళోనున్న ఓ సాకలన్నా
పచ్చిబట్టలు ఎదురుంగదేరా.
వాడనున్న ఓ యక్కలారా
ఒక్కతుమ్మన్న తుమ్మరారే" మాయత్త."

(పాట తేలికగా అర్ధమయింది కనక తలవూపి కొంచెం ఆనందిస్తాడు కాని, ఇంతలో అది రాజసభలో పాడవలసిన పాటు కాదని గుర్తించి తీక్షణంగా చూస్తాడు. పాట మధ్యలో ఆపేసి)

పేర : రాజసభలో పాడవలసిన పాటకాదు. ఒక చక్కని గీతం ఆలపించండి,

( అందరూ చకితులవుతారు )

గాయ : అపరాధం క్షమించాలి.

పేర : ఈ మాటుకి క్షమించాను. ఇలాటి తప్పులు చెయ్యకూడదు.

గాయ : చిత్తం. చెయ్యము.

పేర : ప్రారంభించండి.

(శాస్త్రీయమైన ఒకపాట పాడతాడు గాయకుడు.)

పేర : చాలా బాగుంది. ఈ బహుమానం తీసుకోండి.

(మెడలో నున్న హారం తీస్తాడు. గాయకుడు సగౌరవంగా దానిని పుచ్చుకుని కళ్ళ నద్దుకుంటాడు. సైనికుడు ప్రవేశించి)

సైని : విశ్వాసరావుగారూ, అనుమరెడ్డి వొచ్చారు. దర్శనం కావాలంటున్నారు.

పేర : రమ్మను.

(విశ్వాసరావు అనుమరెడ్డి ప్రవేశం)

పేర : రండి, రండి.

విశ్వా : ప్రభువువారికి కుశలమా ?

పేర : ఆ కుశలము కనకనే దర్బారు. కూర్చోండి.

(విశ్వా, అను – కూర్చుంటారు)

పేర : విశేషాలేమిటి ?

అను : (కొంచెం వెటకారంగా) వానలూ, అవీ సక్రమం గానే కురుస్తున్నాయి ప్రభూ !

పేర : అలాగా, ఆసంగతి చెప్పడానికే వొచ్చారా!

(అనుమరెడ్డి తెల్లబోతాడు)

విశ్వా : క్షమించాలి. ప్రభువువారికి నివేదించడానికి కొత్తవిశేషాలేమీలేవు. తమ ఆరోగ్య విషయమై ప్రజలు చాలా ఆందోళన పడ్డారు. ఇప్పుడు తమకి స్వాస్థ్యం చేకూరినదని విని సంతోషాంతరంగులైనారు.

పేర : సంతోషము.

విశ్వా : నాకూ తమదర్శనం లభించలేదని కించపడిపోయాను ప్రభూ! ఒక్కమాటు దర్శనం చేసుకుని మనస్సు నూరటపరుచుకోవాలన్న కోరిక బలీయమై జనార్దన మంత్రిని ఒత్తిడి చేసినందుకు క్షమార్హుడిని.

జనా : ప్రభువువారిని దర్శించుకోవాలన్న ఆకాంక్ష వారి ఆశ్రితులందరికీ సహజమే. నీ ఆత్రుత నాకు తెలుసు. కాని వారి విశ్రాంతికి భంగంకలగకూడదన్న ఆజ్ఞ దాటురానిది. నేను అసహాయుడను.

పేర : అవును.

విశ్వా : తెలిసికొనలేక చేసిన తప్పినదానికి క్షమించమని ప్రార్థన.

(పేరయ్య జనార్దనుడికేసి చూస్తాడు. జనార్దనుడు తల ఊపుతాడు.)

పేర : సరే క్షమించాము.

విశ్వా : కృతజ్ఞణ్ణి.

(సైనికుడు ప్రవేశించి) జయము జయము ప్రభువారికి. ఢిల్లీ సుల్తాన్ సర్దారు. ముస్తఫాఖాన్ తమ దర్శనానికి వేచియున్నాడు.

జనా : ప్రభువువారు అలసినట్టున్నారు నేటికి సభ చాలించి రేపు వారికి దర్శనం ఏర్పాటు చేయిద్దామా?

(పేరయ్య విద్యానాథుడు కేసి చూస్తాడు)

విద్యా : ప్రభువువారు అలసట చెందారా?

పేర : లేదు.

విద్యా : జనార్దనా! సుల్తాన్‌వారి రాయబారిని ప్రవేశపెట్టడానికి అభ్యంతరం లేదు.

జనా : తమ చిత్తం (సైనికుడితో) రమ్మను.

(సైనికుడు వెళతాడు. ముస్తఫా ప్రవేశించి వొంగి వొంగి సలాములు పెడతాడు.)

ముస్త : సలామ్ రాజావార్కి.

పేర : సలాము కూర్చోండి.

ముస్త : తమ్కి గాయాల్ తగిలాయి విని మాకి దిల్ చాలా గాభ్రా అయింది. ఇప్డు మీకి చూసి ఖుశీ అయింది.

పేర : ఏమి పనిమీద వొచ్చినారు.

ముస్త : మన్వి చేసుకుంటున్నాం. సుల్తాన్‌వార్కి మీతో స్నేహం చెయ్యవాల అని చాలాదినాల్ కోరికవుంది. తమ్కి భేటి చేసి వారి యిష్టంచెప్పడాన్కి నన్ను పంపించినారు. తమ్కి ఢిల్లీ ఆహ్వానం చేసినారు. తమ్కి వీలుఅయినప్పుడు తొందర్‌లో ఢిల్లీకివొచ్చి సుల్తాన్‌వార్కి స్నేహం చెయ్యవాల. మా అర్జీ.

పేర : సరే.

జనా : స్నేహంకోసం మా ప్రభువు ఢిల్లీ రావాలా? ఇదేమికోరిక.

ముస్త : తమ్కి ముందర మన్వి చేశాన్. రాజావారు ఢిల్లీరావడం యిష్టంలేదు. సుల్తాన్‌వారు వరంగల్ వొచ్చి స్నేహం చెయ్యడాన్కి సిద్ధం. స్నేహంలో యెవరీ యింటికి యెవరు వెళ్తార్ లెక్కలేదు.

జనా : స్నేహం చెయ్యాలని ఎందుకో అంత ఆత్రుత.

ముస్త : సుల్తాన్‌వారిది బడా దిల్. వార్కి రాజావారి గొప్ప గుణాల్ తెలిసి స్నేహం కట్టాలా నిశ్చయం చేసుకున్నారు. ఔర్ హిందుస్తాన్‌మీద్కి అఫ్ఘన్‌వాడు దండెత్తి వొస్తాడు. ఢిల్లి పడిపోతే వరంగలుమీద్కి వొస్తాడు. కన్క స్నేహం చేసి వొకర్కి వొక్రు సహాయం చేసుకుంటే అందర్కి లాభం.

జనా : అర్థమయింది. ప్రభువువారు ఆలోచించి సుల్తాన్‌వారికి కబురుచేస్తారు.

ముస్త : రాజావార్కి దర్శనం అయింది. మాకీ చాలా సంతోషం. సుల్తాన్‌వార్కి యెప్పుడు భేటీచేసేది కొంచెం చెప్తే యింకా సంతోషం.

జనా : అది యింత త్వరలో చెప్పగల విషయం కాదు. సుల్తాన్‌వారి కోరికమాత్రం తప్పక మన్నించబడగలదు.

ముస్త : ఫలాని తారీఖు భేటీ చెప్పలేరు. కాని రాజావారు ఢిల్లీ వొస్తార్. నహీ తో సుల్తాన్‌వారు వరంగల్ రావాలి. ఈ మాట రాజావారు చెప్తే సుల్తాన్‌వార్కి తయార్ చేస్కోడాన్కి షులభం.

జనా : అదీ ఆలోచనీయాంశమే.

ముస్త : రాజావార్కి ఖుషీ. స్వయంగా వార్కి హుకుమ్ ఫర్మా యిస్తే సుల్తాన్‌వారికి చెబుతాము.

(పేరయ్య విద్యానాధుడి వైపు చూస్తాడు. విద్యానాధుడు జవాబు చెప్పమని తల వూపుతాడు.)

పేర : యుగంధరమంత్రిగారు నగరంలో లేరు. వారు వొచ్చిన తరువాత వారితో ఆలోచించి సుల్తాన్‌వారికి కబురు చేస్తాము. సుల్తాన్‌వారితో స్నేహము మాకూ యిష్టమే అని చెప్పు.

ముస్త : బహుత్ అచ్ఛా. బహుత్ ఖుషీకి బాత్. తమ సందేశం, సుల్తాన్‌వార్కి చాలా సంతోషం కలిగిస్తుంది. యుగంధర్ మంతిరిగారు యెప్పుడు వొస్తారు మాకీ కొంచెం చెబుతే...

జనా : అది మా కెవరికీ తెలీదు. వారు రాగానే ఆలోచించి కబురు చేస్తామని రాజుగారు సెలవిచ్చారు. అది చాలదా?

ముస్త : చాలు జనార్దన్ మంతిర్జీ, చాలు. లేకిన్ యుగంధర్ మంతిరి ఎప్డు వొస్తారు తెలిస్తే ఆ ఖబర్‌కూడా సుల్తాన్‌వారికి చెప్ప వొచ్చు అని మేము ఆలోచించాము.

జనా : త్వరలోనే కబురుచేస్తామని చెప్పండి.

ముస్త : బహుత్ ఖుషీసే చెప్తాం.

జనా : సరే, వెళ్ళిరండి.

ముస్త : మాకీ రాయబారం ఫలించిందీ, చాలా గర్వంగా వుంది.

జనా : మీ రాయబారం యీ విధంగా ముగిసిందని మాకూ చాలా ఆనందంగానే వుంది.

ముస్త : సలామ్ రాజాగార్కి.

పేర : సలామ్.

ముస్త : మీరు మాకి యెంత గౌరవం చేసినారు, సుల్తాన్‌వారికి చెప్తాం.

పేర : సరే,

ముస్త : ఢిల్లీ సుల్తాన్‌వారి వజీర్ ముస్తఫాఖాన్ ఫిర్ సలామ్.

పేర : సుల్తాన్‌వారికి మా సలాములు చెప్పు.

ముస్త : తప్పకుండా చెప్తాం.

(లేచి సలామ్, సలామ్ అని వొంగి సలాములు పెట్టుకుంటూ వెళ్ళిపోతాడు.)

విద్యా : ఈ రాయబారంలో ఏదో మోసముంది.

(ఎవరూ మాట్లాడరు. అలిసిపోయినట్లు పేరయ్య మొహం తుడుచుకుంటాడు.)

జనా : ప్రభువువారు అలిసిపోయినట్టుంది. నేటికి సభ చాలిద్దామా.

పేర : అవును.

జన : క్షమించాలి. శ్రమయిచ్చినందుకు.

పేర : ఫరవాలేదు.

(అందరూ లేస్తారు.)

పేర : వెళ్ళిరండి.

(ఒక్కొక్కరే దండంపెట్టి వెళ్ళిపోతారు. జనార్ధన విద్యానాథులు మిగులుతారు.)

జనా : ఆహా విద్యానాథులమహిమ. అనూహ్య మీ మార్పు.

విద్యా : నా నమ్మకం సార్ధకంచేసిన పేరయ్య నభినందించాలి. జయము జయము ప్రతాపరుద్ర మహారాజుల సాక్షాత్కరింప జేసిన పేరయ్య మహారాజునకు.

పేర : (నమస్కరిస్తూ) గురు దేవులకి నమస్కారం.

జనా : (మోకరిల్లి) అభివాదం, ప్రభూ.

పేర : సంతోషము. (జనార్దన లేస్తాడు) గురుదేవా నేను దిగ వొచ్చునా.

విద్యా : అభ్యంతరం లేదు.

(పేరయ్య లేచి సింహాసనం దిగి)

పేర : తప్పులేకుండా చేశానా.

విద్యా : అమోఘంగా ప్రతాపరుద్ర మహారాజే నిన్నుచూసి తనేమో నని భ్రమసిపోయేటట్లు ప్రవర్తించావు.

పేర : (విద్యానాధుడి కాళ్ళమీద వాలి) మీ దీచ్ఛ మహిమ బెమ్మ దేవుడా! ఇప్పుడు యెల్లినోపాలి సూపిత్తె, నాపేనం సల్ల గుంటుద్ది.

విద్యా : దానికింకా సమయం రాలేదు, సమయ మొచ్చినప్పుడు నేనే స్వయంగా తీసుకొచ్చి చూపిస్తాను.

పేర : మీ కటాచ్ఛం.

విద్యా : ఈ గదుల్లో ఆ యాస పనికిరాదని చెప్పలేదా ?

పేర : సింహాసనంమీద కూకున్నప్పుడొద్దన్నరు గదిలోకాదు.

విద్యా : నిజమే. కాని పూర్వంకంటె ఎక్కువ మెలకువతో ప్రవర్తిం చాలి. నీ యోగం ఫలించడానికి పూర్వం శత్రువులూ ఎక్కు వవుతారు. మోసం జరగకుండా కాపాడుకోవాలి. మీ గూడెంలో చాకలివాళ్ళు నిన్ను మోసం చెయ్యగలిగే వారా ?

పేర : సాకలోళ్ళు నన్ను మోసంజేస్తరా, యెదవలు, పేరయ్య కళ్లుతెరిచి సూసినడుగంటె.

విద్యా : ఇప్పుడూ నువ్వు అందరిని ఒక కంట కనిపెట్టిచూస్తూ తెలివి తేటలతో ప్రవర్తించుకోవాలి.

పేర : మీరు గన నాదగ్గిరుంటె నాకేం భయం!

విద్యా : నేను నీదగ్గర వున్నప్పుడేగాదు. ఇకనించి నువ్వు ఈగదిలో వున్నంతకాలము, పేరయ్యవికాదు. ప్రతాపరుద్ర మహారాజువనే ప్రవర్తించాలి. ప్రతాపరుద్ర మహారాజులా ఈనాడు దర్శనమిచ్చినవాడు పేరయ్య అని పై వారెవరికి తెలిసినా, నీకూ నీయెల్లికికూడా ప్రాణాపాయం. తెలిసిందా మంచి పోకు.

పేర : మర్చిపోను. బెమ్మదేవుడా, మర్చిపోను.

విద్యా : పద జనార్దనా, శ్రమ ఫలించింది. కొంతకాలం విశ్రాంతి తీసుకోవచ్చును.

(అని వెళ్ళిపోతూ వుంటారు)

పేర ; దండాలు.

విద్యా : (వెనక్కి తిరిగి) జాగర్త. చదువుకున్నవారికంటె చాకలి మేలని ఋజువు చేసుకోవాలి. నా విశ్వాసం వృధా చెయ్యకూడదు.

(వెళ్ళిపోతారు.)

పేర : నా రంగా సూస్కో నా తమాస! అరె యెదవసాయాలా గెట్ట నించుని తొంగుంటవేట్రు!

(సేవకుడు నిద్దరోతున్నాడు. ఉలిక్కిపడి లేచి ఉత్తసింహాసనానికి విసురుతాడు.)

పేర : నే నిక్కడుంటె సంవాచనానికి యిసురుతాడేం ముండ కొడుకు! గిక్కడ రాయెన్.

సేవ : ఇలా మాట్లాడుతున్నారని విద్యానాథులవారికి చెప్పానంటే.

పేర : బుద్ధి బుద్ధి (సేవకుడు పేరయ్య వున్నచోటికివొచ్చి విసరడం ప్రారంభిస్తాడు.) నాలు నువ్వుపోరా.

సేవ : దుస్తులుతీసేసి విశ్రాంతి తీసుకుందురుగాని, రండి.

పేర : నొస్తును. నువ్వు ముంగలనడు.

(సేవకుడు వెళ్ళిపోతాడు.)

(విశ్వాసరావు తొంగిచూస్తాడు. అటూ యిటూ చూసి ఎవరూ లేరని కనిపెట్టి, బయటికొచ్చి)

విశ్వా : పేరిగా!

(పేరయ్య ఉలిక్కిపడతాడు. ఆగి తీక్షణంగా చూస్తూ రాజు ఉచ్చారణలో)

పేర : ఎవరది.

విశ్వా : నేనేరా.

పేర : ఎవరితో మాట్లాడుతున్నావో తెల్సునా.

విశ్వా : తెలుసురా. చాకలి పేరిగాడివి కాదూ?

పేరి : కళ్ళు నెత్తిమీదికి వొచ్చినట్టుంది. పిచ్చి యెక్కిందా?

విశ్వా : నాకు తెలీదనుకున్నావురా!

పేర : (గట్టిగా) ఎవరురా అక్కడ.

(సైనికుడు లోపలికొస్తాడు. వాడిని చూడగానే విశ్వాసరావు హడలిపోయి పేరయ్య కాళ్ళు పట్టుకుని.)

విశ్వా : తమ దర్శనం లభించక ఎంత తహతహలాడి పోయానో చెప్పలేను ప్రభూ.

సైని : ఏమి ఆజ్ఞ.

(విశ్వాసరావు ఇంకా కాళ్ళు పట్టుకునే వుంటాడు.)

విశ్వా : నా సాహసం మన్నించండి. ఈ దీనుడి మొర సాంతంగా ఆలించండి.

పేర : సరే (సైనికునితో) ఇప్పుడు అవసరం లేదు. నువ్వు పో.

సైని : చిత్తం.

(వెళ్ళిపోతాడు.)

పేర : లే జాగర్తగా మాట్లాడు.

(విశ్వాసరావు లేస్తాడు. ఎలా ఉపక్రమించాలో తెలీదు.)

పేర : చెప్పు.

విశ్వా : క్షమించాలి. చివరిదాకా వినికాని ఏనిర్ణయానికీ రాకూడదు. ఎవరినీ పిలవకూడదు.

పేర : సరే మర్యాదగా మాత్రం మాట్లాడు. లేదా?

విశ్వా : చిత్తం – సుల్తాను సేనలు ప్రతాపరుద్ర మహారాజుని ఢిల్లీ బందీగా పట్టుకుపోయిన సంగతి తమకి తెలిసే వుంటుంది.

పేర : నువ్వు చెప్పవలసిన విషయం నువ్వు చెప్పు. మాకు తెలిసిన విషయం నీకు అనవసరం.

విశ్వా : ఏమి దబాయింపు.

పేర : సైనికులని పిలవనా!

విశ్వా : వొద్దొద్దు. దానివల్ల ఎవరికీ లాభంలేదు. ఢిల్లీకి పట్టుకు పోయినది ప్రతాపరుద్ర మహారాజుకాదనీ, ఆయనని పోలిన నకలి పేరిగాడనీ, ప్రచారంచేసి వాడిని విడిపించుకు వస్తానని యుగంధర మంత్రి మాయమయ్యాడు. ప్రతాపరుద్ర

మహారాజుకి, మీకు గలపోలిక ఉపయోగించుకొని మీకు రాజువేషం వేసి ఈ నాటకం ఆడుతున్నారు. కాని ఈ సంగతి ఢిల్లీ సర్దారులు పసికట్టారు. ఢిల్లీలో వున్నది ప్రతాపరుద్రుదేవని, ఇక్కడ రాజుగా వ్యవహరిస్తున్న దే పేరిగాడని వారు తెలుసు కున్నారు. అది నిర్ధారణ చేసుకోడానికే ముస్తఫాఖాన్ తొందరపెట్టి దర్శన మిప్పించుకున్నాడు. మీ నటన అద్భుతంగా వుందికాని మాకళ్ళు కప్పలేదు. వాడు ఢిల్లీకి నిజవిషయం తెలియజేస్తాడు. యుగంధరుల వ్యూహం ఇక పారదు. ఢిల్లీలో ప్రతాపరుద్రులకి బందీ తప్పించుదామని ప్రయత్నిస్తే మరణము తప్పదు.

పేర : ఇది నీ కథ.

విశ్వా : నాకథకాదు. జరిగినది జరగబోయేది. అక్కడ రాజుకి ప్రమాదం సంభవించినప్పుడు మీకు పతనం తప్పదు. రాజు ఏ వేటలోనో మరణించినట్లు వార్త సృష్టించి యువరాజు పేరిట యుగంధరుడో, జనార్దనుడో రాజ్యమేలుతాడు. ఈనాడు మీరురాజు, రేపు తిరిగీ చాకలి పేరిగాడు.

పేర : జరగబోయేది జరగక మానదుగదా! మన కెందుకు విచారము ?

విశ్వా : విధిని మన వశం చేసుకోగలిగిన అవకాశాలు అరుదుగా లభిస్తాయి. అది యీనాడు మీకు లభిస్తోంది. మీకు తగిన ధైర్యమూ, సాహసమూ వుంటే ... ...

పేర : ఎలాగ ?

విశ్వా : మీరే రాజని ప్రచారం చేశారు. పదిమందికీ దర్శన మిప్పించారు. మీరూ చాకచక్యం ప్రదర్శించి మీరే రాజని ఋజువుచేసుకున్నారు. ఆ స్థానం వొదలకండి.

పేర : అంటే ?

విశ్వా : ఇకముందు ఎవరువొచ్చి, మీరు రాజుకాదు—పేరిగాడే అని చెప్పినా కాదని తిరస్కరించాలి. మీరే రాజు. ఢిల్లీలో పోయిందే పేరిగాడు.

పేర : ఢిల్లీనుంచి యుగంధరులు పేరిగాడిని పట్టుకువస్తే ?

విశ్వా : అసంభవం. ఆ ప్రయత్నంలో యుగంధరామాత్యులకి మరణం తప్పనట్టు తోస్తుంది. ఒకవేళ వారి యత్నం ఫలించి ఖైదీని తప్పించినా, ఆ వొచ్చినవాడే పేరిగాడు. మీరే ప్రతాప రుద్రులు.

పేర : యుగంధర మహామాత్యులని ఎదిరించి !

విశ్వా : ఏమీ భయపడకండి మీకు కావలసినంత సహాయ ముంటుంది.

పేర : ఎవరి సహాయం ?

విశ్వా : నే చెప్పినట్టు నడుచుకుంటానని వాగ్దానం చేసినతర్వాత తెలుస్తుంది.

పేర : ఆలోచించి ...

విశ్వా : ఆలోచనకి అట్టే వ్యవధిలేదు. ఈ సంగతి జనార్దనుడికిగాని, విద్యానాధుడికిగాని చెప్పారా, ఇప్పుడే మీ ప్రాణానికి ప్రమాదం. తెలిసిందా ! నే చెప్పిన పథకానికి ఒప్పుకుంటే మీకు శాశ్వత రాజపదవి. లేదా అధఃపతనం.

(లోపలినుంచి నౌకరు : ప్రభూ! విశ్రాంతికి వేళ అయింది.)

విశ్వా : నే చెప్పినది మరిచిపోకూడదు. సరేనా... మీ మేలు కోరే జనార్దన ప్రభృతులు మిమ్మల్ని ఉపయోగించుకుని మీ అవ సరం తీరిపోయిన తరవాత ఏ సంకోచమూ లేకుండా

తొసిపారేస్తారు. నమిలివేసిన చెరుకుపిప్పిని ఉమ్మేసినట్టు మిమ్మల్ని విసిరిపారేస్తారు. అదీ మరిచిపోకూడదు.

(లోపలినించి నౌకరు: ప్రభూ ఇంక దర్బారు ముస్తాబు తీసెయ్యాలి.)

పేర : రేపు సాయంకాలం కనిపించు. జవాబు చెబుతాను.

విశ్వా : సరే. ఎవరికైనా ఈసంగతి చెప్పారా, ప్రాణాలు దక్కవు జ్ఞాపకముంచుకోండి. రేపు సాయంకాలం తిరిగి దర్శనం. అదృష్టం మిమ్మల్ని చాకలిపేటనించి రాజసౌధానికి ఎత్తింది. తిరిగి పడిపోకుండా మార్గంచూపించాను. పైన మీయిష్టం.

(గబగబ నడిచి వెళ్ళిపోతాడు.)

పేర : బెమ్మదేవుడా! యేంచంకటం వొచ్చి పడ్డది. నాయెల్లితో సుకంగ బతికెవోణ్ణి నన్నట్టుకొచ్చి, చింవాచనంమీద పారేసినవు. దిగకుండ ఆడెకూకుండమంట అశపెడ్తుండవు. నాకీయేసం ఎందుకేస్తున్నరో తెలిసినాదికాదు. గిప్పుడు తెల్చింది. రంగా,గిదా యెవ్వారం. రాజుసొట్టుకుపోతె నన్నొట్టుకు పోయరంటరు! యోగం పట్టించి దిచ్చయిచ్చరు! యిశ్వాసరావు మాటింటె నా యోగానికి తిరుగెనేదు. రాజు యేసంయేయించి నాటక మాడించినరు. నాటకం నిజమయి పోద్ది. పేరయ్య అచ్చంగ పెతాపరుద్ద రాజయిపోతుండు. ఆళ్ళుసెపితే నాటకమాడి శబాసనిపించుకున్నవోణ్ణి, యిశ్వాసరావు సెప్పిన నాటకమాడ నేను? ఒప్పుకున్నంటె సింవాచనం మీంచి దిగక్కర్నేదు. నేనురాజు యెల్లిరాణి. బలేబలే అదృట్టం. బలెబలే సుకం. (ఆనందిస్తూ ఒక్కక్షణ ముంటాడు) యెదవనాయాలా. నీ కెందుకుర,

యీ యెదవబుద్ది! బెమ్మదేవుడు సెప్పినమాటినకుండ సెయ్యడమె, పెతాపరుద్ద మారాజుగారింటో సేవసేసుక బతికెవోణ్ని, నాను రాజునెట్ట! ఒప్పుకోకపోతే, మీతో సెబితె, సంపెత్త నంటుడు యిశ్వాసరావు, నన్ను సంప నేడుగట్టు. ఢిల్లీలో రాజుకి పెమాదం రావొచ్చు. ఓరి యిశ్వాసరావు, రాజింటు ఉప్పుతిన్నవు రాజుకె ద్రోహం తలచుండవు. నీకింత యెదవబుద్ది యెట్ట పుట్టిందిర! నిన్ను సంపెత్తె పెమాదం ఎట్టపోద్ది? బెమ్మదేవుడా, యెట్ట దారి, (మోకరిల్లి) గురుదేవా నాకు బుద్దిసూపించు. (ఒక్క క్షణం నిశ్శబ్దంగా వుంటాడు. లోపలి నుంచి 'ప్రభూ' అని పిలుపు. దానితో నిశ్చయాని కొచ్చినట్టు లేచి నించుంటాడు) నానెందుకు రాజుకాను చందేహంనేదు. నానురాజునె. నానెరాజుని అహహ (స్వచ్ఛమైన ఉచ్చారణలో) నేనే రాజుని. పేరయ్య మహారాజుని (పై స్థాయిలో) ప్రతాప రుద్ర మహరాజుని అవును. ప్రతాపరుద్ర మహారాజు నే కాదనకలవాడెవడు? (అని ఠీవిగా లోపలికి నడిచి వెళ్ళ బోతాడు).

(యెల్లి మెల్లిగా తొంగిచూస్తుంది.)

ఎల్లి : మావాఁ,

పేర : (ఉలిక్కిపడి ఆగిపోతాడు) ఎవరది?

ఎల్లి : మావాఁ

పేర : (ఆనందం అనుభవిస్తు) మావాఁ (తేరుకుని కఠినంగా) మావా? ఎవరది?

ఎల్లి : నానె యెల్లిని మావా!

పేర : (పరవశంతో) యెల్లీ (కఠినంగా) యెల్లి ఎవరు నువ్వు ఎక్కడున్నావు. ఎలావొచ్చావు.

(యెల్లి పూర్తిగా లోపలికొచ్చి కనిపిస్తుంది.)

ఎల్లి : పేరయ్యమావాఁ నీయెల్లినే మావాఁ.

(పేరయ్య ఎల్లినిచూస్తూ ఒక్కక్షణం నిలుచుండిపోతాడు. తరవాత తేరుకుని)

పేర : యెల్లి ! నువ్వు లోపలికి ఎలావొచ్చావు ఎవరు రానిచ్చారు ఇది నీకు చాలా ప్రమాదం.

ఎల్లి : యెన్ని దినాలయిందె మావా, సెప్పకుండ పోయినవు. యెంతయేడ్చిననో నీకే ఎరుక !

పేర : తెలిసింది. యెల్లి తెలిసింది. నేను ప్రతాపరుద్ర మహారాజుని నీ పేరయ్యనుకాను యెల్లి. పేరయ్య ఢిల్లీలో వున్నాడు. నేననుకుని వాడిని పట్టుకుపోయారు తురక సర్దారులు. వాడిని తీసుకురావడానికి మంత్రి యుగంధరులు వెళ్లారు. తీసుకువొస్తారు. నీ పేరయ్యని నీకు పంపిస్తాము. నేను ప్రతాపరుద్ర మహారాజుని.

ఎల్లి : (నవ్వుతూ) నువ్వెప్పుడు నారాజువె మావా. గిప్పుడు మారాజయిపోయినవు. రాజయిన, మారాజయిన, పేరయ మావ, పేరయమావే.

పేర : (ఆనందిస్తూ) వారెవా. (తేరుకుని కఠినంగా) యెల్లీ ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసుకుని మాట్లాడు. నేను పేరయ్యనికాను. ప్రతాపరుద్ర మహారాజుని.

ఎల్లి : బలే షోకుగుంటవు, మావా. గిప్పుడు కళ్ళు సల్లగుంటవి. తురకోళ్ళు నిన్నేటి సంపుతుండరని గుబులు గుబులు పడ్డ ..

నువ్వు రుపియకుంటే వొళ్లంత వుకుకెత్తుద్ది నీకు తెల్సుగద మావా, నువ్వు గిక్కడుంటివని సల్లగుంటివని కబురెందు కెట్టవె మావా. నామీద గన కోపమా, మావా.

పేర : (జాలిగా) యెల్లీ చెప్పేదది అర్ధం చేసుకో. నేను ప్రతాప రుద్ర మహారాజుని.

ఎల్లి : ప్రెతాపరుద్ద మారాజు ఢిల్లీలో వున్నండు. నాకుతెల్సు. తురకోడు యిప్పుడే సెప్పిండు.

పేర : అబద్ధం ఎవరు నీతో చెప్పినది. ఎవరా తురకవాడు.

ఎల్లి : నిన్ను జూసిండు ముస్తఫఖాన్.

పేర : అది అబద్ధం. అబద్ధం పేరిగాడే ఢిల్లీలో వున్నాడు. నేనే ప్రతాపరుద్ర మహారాజుని (గట్టిగా) ప్రతాపరుద్ర మహా రాజుని నేనే. ఎవరురా అక్కడ.

సైని : (ప్రవేశించి, ఎల్లినిచూసి) ఏయ్ ఎవరునువ్వు. లోపలికి ఎలా వొచ్చావు బయటికి నడు.

ఎల్లి : రచ్చించండి మారాజా. తురకోళ్ళు నా మావని ఢిల్లీ అట్టుకు పోయిన్రు. ఇడిపించి నా మావ నెప్పు డిప్పిస్తరో చెల విప్పించండి! నా కింకె టొద్దురాబొ. ఒక్కమాట సెప్పిన గని పోతను. నన్ను రక్షించండి మారాజా.

పేర : ఇది పేరయ్య పెళ్ళాం, ఎల్లి. దీని గోడు నాతో చెప్పుకో డానికి వొచ్చిందిట—సరే. నువ్వు పో.

సైని : చిత్తం. (వెళతాడు.)

పేర : వీలైనంత త్వరలో నీ పేరయ్యని నీ కిప్పిస్తాము ఎల్లి. ఇంక నువ్వు వెళ్ళవచ్చు.

ఎల్లి : మా రాజా మిమ్మల్ని చూస్తుంటె నా మావని చూసిన ట్టుంటది. కళ్ళు సల్లగుంటవి. వొల్లు చక్కగుంటది. ఈడ

నుండనివ్వండి. మీ గుడ్డ లుతుకుత, మిమ్మల్ని సూసుకుంటు, మీ పాదాలకడ పడుంట.

పేర : నువ్వు యిక్కడ వుండడానికి వీలులేదు. అది నీకు చాలా ప్రమాదం.

ఎల్లి : నాకేం పెమాదంలేదు మారాజా. ఇంటికాడుంటెనె పెమాదం.

పేర : అఁ. నీ యింటి చుట్టూ సైనికులని కాపలా వేయిస్తా, భయ పడకు. నిన్ను ముట్టుకున్నవాళ్ళని చంపి పారేస్తా.

ఎల్లి : అట్టాటి బయంకాదు మారాజా. ఢిల్లీకి రా, నీ మావని సూపిత్తనంటు ఆశపెట్టి సంపుతున్నరు.

పేర : అది మోసం, పచ్చిమోసం. నువ్వు ఢిల్లీ వెళ్ళకు. నీ మావని యిక్కడికే తెప్పించి యిస్తాము. నా మాట నమ్ము.

ఎల్లి : ఆ మాట సెప్పినరు మారాజా. మా మావ లేకుంటె రేత్తిల్లు నిద్దుర పట్టదు.

రేతిరి, రేతిరి వత్తానని చందమామయ్యో మావ
రాతిగందం తీసి ఉంచితి ,,
రేతిరి రేతిరి రాకపోతె ,,
రాతిగందం యింకిపోయె ,,
ఇప్పు డిప్పుడు వత్తానని ,,
ఇప్పచెట్టు నీడనుంటె ,,
ఇప్పు డిప్పుడు రాకపోతే ,,
ఇప్పపువ్వులు గప్పున రాలె ,,

పేర : (ఆనంద పారవశ్యంలో) హాయి హాయి ఎంత చక్కగా పాడావు, యెల్లి.

ఎల్లి : మావ నన్ను తలుసుకంటున్నడో లేదో. మరిచిపోతవమావా.

కలలోన కానవేమిటిరా
నీ కోసం యేచివుంటినిరా
కాలుకురచ ఆడదానినిరా
మూరతక్కువ చీరలంపారా
చీరలంపు మూడలంపారా
సిన్నమరిదిని పంపబోకురా
సిన్నమరిది సిత్త పిడుగురా
చీరలోన మూరచింపురా
కలలోన కానవేమిటిరా
నీ కోసం యేచివుంటినిరా
గువ్వచేత గురుతులంపారా
కాకిచేత కబురులంపారా
కలలోన కానవేమిటిరా
నీ కోసం యేచివుంటినిరా.

పేర : (కరిగిపోయి కళ్ళుతుడుచుకుంటూ) యెల్లి నువ్వు వెంటనే వెళ్ళిపోవాలి. ఇక్కడ వుండకూడదు.

ఎల్లి : మారాజా యింటికడ ఒక్కత్తెని బతకలేను. మిమ్మల్ని జూసుకుంటు, మీ పాదాలకడ పడుంట. మీ పాదాలొదల్ను (అని అకస్మాత్తుగా ముందుకి దూకి పాదాలు చుట్టేసుకుంటుంది. మోకాలుమీద గోక కితకితలు పెడుతుంది. అక్కడ సాధారణంగా ఎవరికీ కిత కితలు వుండవుకాని, పేరయ్యకి అక్కడ కిత కితలు.)

పేర : ఏమిటి ఈఅగడం యెల్లి ... వొద్దు యెల్లి వొద్దు. (నవ్వు ఆపుకోలేక నవ్వడం ప్రారంభిస్తాడు) యెల్లి, వుండస్సె. గమ్మునుండు.

(ఇంక అనుమానం ఏమీ లేదు.)

ఎల్లి : గిప్పుడు సెప్పు మారాజా నువ్వు నా రాజువికాదు! నా మావవికాదు. నే నిట్టం నేదు. నన్ను యిడిసిపోతవ.

పేర : (ఇంక ఏమీ ఆపుకోలేడు) నన్నొదిపియ్యకె యెల్లి. నువ్వె నా పేనం. నువ్వు లేకుంటె ఒక్కదినం ఒక్క చంవత్సరం. (లేవనెత్తుతాడు.)

ఎల్లి : ఈ యేసమేటి మావా.

పేర : నాకు యోగంపట్టించినరు. ఈ యేసం యేసినరు. నిన్ను సూత్తె నువ్వు సచ్చిపోతవు అని బయపెట్టినరు.

ఎల్లి : తురకోడు నిజంగ రాజునట్టుకు పోయిండు. నీకు రాజు యేస మేయించి నాటకమాడిస్తున్నరుగని ఖానయ్య మొదల చెప్పిండు. అనక యిశ్వాసరావుగూడ చెప్పిండు.

పేర : మొదట్లో తెలిసుండలేదు. గిప్పుడు చంగతంత తెలిసింది. యిశ్వాసరావు నన్ను చూసిండు. గిప్పుడు నువ్వె పెతాప రుద్రరాజుగ వుండిపొమ్మని సల్ల యిచ్చిండు.

ఎల్లి : అదెట్ట మావా.

పేర : (స్వచ్ఛమైన ఉచ్చారణలో) నేనే ప్రతాపరుద్ర మహారాజుని, తురకలు బందీగా ఢిల్లీకి పట్టుకుపోయినది పేరిగాడినే. ఇక్కడ నేనే రాజ్యమేలుతా!

ఎల్లి : (నిర్ఘాంతపోయి) వోయ్ నారాజా.

పేర : చాలమంది నాకు సహాయం చేస్తారని విశ్వాసరావు చెప్పాడు. ఒప్పుకుంటె నాకు రాజ్యం. ఒప్పుకోకుంటె నా ప్రాణానికి ముప్పం. నిజంగా నేనే ప్రతాపరుద్ర మహారాజుని.

ఎల్లి : యేసం యేయించినరు. నాటక మాడించినరు. నువ్వునిజంగా రాజెట్టవుతవు.

పేర : ఆల్లేయించినరు ఆడినను (ఉచ్చారణ మార్చి) ఇప్పుడు నేనే వేషంవేసి నాటకం ఆడతాను. ఎవరు కాదనగలరు?

ఎల్లి : తరతరాలుగ మారాజుల ఉప్పుతిన్నము గిప్పుడు అల్లకి ద్రోహం చేస్తమ, మావా.

పేర : నేను రాజునని పదిమందికి వాళ్ళేచెప్పారు. తురకలు ఢిల్లీలో రాజుని చంపుతారంట. అప్పుడు నేనే రాజు ననడము ద్రోహం కాదు.

ఎల్లి : ఏట్లు! గిదిని ంకాదు మావా. గిది యిశ్వాసరావు ద్రోహం. యుగంధరులు గెలుచుకొస్తరు రాజుని యిడిపించుకొస్తరు. నువ్వు, యిశ్వాసరావు మాట యినకు.

పేర : యుగంధరులు ఓడిపోయారనుకో.

ఎల్లి : యువరాజుంటడు మావా.

పేర : యువరాజు రాజ్యం నాకే ఎందుకు రాకూడదు. నాకు యోగం పట్టింది. నాకే రాజ్యం. నేనే రాజుని.

ఎల్లి : (యేడుస్తూ) యెర్రెక్కింది మావాఁ నీకు. నీమనసిరిగి పోయెన్ది నే నంతే నీ కిష్టం లేదు.

పేర : అట్టగనకు యెల్లి నువ్వంతె నాపేనం.

ఎల్లి : మరిగని నువ్వు రాజయిపోతె గిక్కడ రాణులుంటురు. నన్ను సూడవు. మావాఁ నేబతకను, గిక్కడ పేనంతీసుకు చచ్చి పోతను.

పేర : నువ్వు లేకుంతే నేను బతకను, యెల్లి !

ఎల్లి : మనంపోయి సుకంగ బతుకుతము మావా. మనకీ రాజ్జె మొద్దు.

పేర : గిప్పుడెల్దామంతె యిశ్వాసరావు చంపుతడు,

ఎల్లి : యిశ్వాసరావు మాట యినుకున్నట్టు నాటక మాడు మావా. ఆడి ఆజ్ఞ పట్టియ్యి. తురకోణ్ని నేను చూసుకుంట !

పేర : ఎట్టా ! ఒకే సలహా చెప్పినవు యెల్లి ! ఇగ చూడు మన తమాస, రెండు యేసాలేస్త !

ఎల్లి : జాగర్త గుండు మావా.

పేర : నువు బద్రంగ యింటికి పోవె.

ఎల్లి : నే నొస్త; మరువకు మావా.

ఏడు లోకాలు మన
కాడనే వుంటయ్యి
ఏడకీ పోవొద్దె, చంద్రమ్మా.
యీడనే వుందాము. చంద్రమ్మా

(పాడుకుంటూ వయ్యారంగా వెళ్ళిపోతుంది.)

పేర : నా యెల్లి నా పక్కనుంటె యెందకనె యీ రాజ్జెం! నీ యెనక వొచ్చెయ్యాలనుందె యెల్లి; పారిపోయి వొచ్చెద్దునా ఎట్టా. రాజ్జానికి పెమాదమే. రచ్చించాలె! (స్వచ్ఛమైన ఉచ్చారణలో) అవును. రాజ్యాన్ని రక్షించవలసిన బాధ్యత నామీదే వుంది. చూడు మన తమాషా. రెండు వేషాలు వేసి నాటకం నడిపిస్తా. (మోకరిల్లి) గురుదేవా! శక్తి ప్రసాదించు.

( తెర )

# నాలుగో అంకం

[దర్బారుహాలు. రాజవేషంలో పేరయ్య పచారు చేస్తున్నాడు.]

సైని : ప్రభూ ఏడునెలల పదిరోజుల అజ్ఞాతవాసానంతరం మహా మంత్రి యుగంధరులవారు నగరానికి తిరిగి విచ్చేస్తున్నారు. వారికి తమరు నగరపొలిమేరలో స్వాగతమిచ్చి పురప్రవేశం చేయించాలి. బయలుదేరడానికి సిద్ధంగా వుండవలసిందని జనార్దనమంత్రి చెప్పి రమ్మన్నారు. తమరిని తీసుకునివెళ్ళ డానికి కొద్దిసేపటిలో వారు స్వయంగా వొస్తారు.

పేర : సరే.

(సైనికుడు వెళ్ళిపోతాడు)

పేర : యుగంధర మంత్రిగారొచ్చరుగంటె పెతాపరుద్ర మారాజు గోరిని తెచ్చినరన్నమాట. ఢిల్లీలో అరికి పెమాదమని యిశ్వాసరావు చెప్పింది అబద్ధ మయిపోయిన్ది. సల్లంగ మారాజు వొచ్చేసినరు. గిక్కడితో పనయేసం తీరిపోద. యిశ్వాసరావూ. అయిపోయిన్ది. నీ రోగం కుదురది. (ఒక్క క్షణం ఆలోచిస్తూ) యిశ్వాసరావు అంత తేలిగ్గ వూరు కుంటడ! ఢిల్లీలో నేకపోతె గిక్కడ పెమాదం అన్నడు రాజు గోరికి. నన్ను పొలిమేరకడకి రమ్మంటున్నరు. గిక్కడ మనుషులమార్చి ఢిల్లీనించి నన్ను తెచ్చినని సెప్పు తారుగట్టు. గంటె, అడనె పొలిమేరకడనె పెమాదం. బగ మంతుడా, యీ చంకడంతూడ తప్పించు. మల్లొపాలి

యెల్లొచ్చి చలహాయిత్తె బావుండును. యేటి తోచటంనేదు. (మోకరిల్లి) బెమ్మదేవుడ! మీరె దారి చూపిత్తుండాలి. (కళ్ళుమూసుకుని ఒక్కక్షణం వుంటాడు)

జనా : (ప్రవేశించి) సిద్ధమా ప్రభూ.

పేర : (తీవిగా లేచి) దేనికి?

జనా : బయలుదేరడానికి.

పేర : ఎక్కడికి?

జనా : యుగంధరామాత్యుల స్వాగతానికి, నగర పొలిమేరకి.

పేర : యుగంధరులు అనేకమాట్లు నగరానికి వొచ్చి వెళుతూ వుంటారు. వారికి పొలిమేరలో ఇప్పుడు ఎందుకు స్వాగత మివ్వాలి? దానికి నే నెందుకు వెళ్ళాలి?

జనా : మహామంత్రి యుగంధరులు ఏడునెలలు అజ్ఞాతవాసంలో వుండి అఖండవిజయం సాధించి నేడు నగరప్రవేశం చేస్తు న్నారు. కనక వారికి అక్కడ స్వాగత మివ్వాలి.

పేర : ఏమిటా విజయం?

జనా : (తెల్లబోయి) విజయం ఏమిటా?

పేర : ఔను.

జనా : అది తరవాత చెబుతాను. మొదట బయలుదేరు.

పేర : చెప్పినతరవాతగాని బయలుదేరను.

జనా : (కోపంతో) పేరిగా.

పేర : నోరు జాగర్త. ప్రతాపరుద్ర మహారాజుని.

జనా : (నిర్ఘాంతపోయి) ప్రతాప... ...ఏమి దుర్బుద్ధి. ఛీ, ఛీ!

పేర : నేను ప్రతాపరుద్రమహారాజుని; ఔనా, కాదా?

జనా : కాదు.

పేర : కేకవేసి ప్రజలందరికీ చెప్పనా! (గట్టిగా) ఎవడురా అక్కడ?

జనా : (గాభరాగా) ఊరుకో వూరుకో.

పేర : (వెళ్ళి సింహాసనముమీద ఠీవిగా కూర్చుని) ప్రతాపరుద్ర మహారాజుని.

జనా : (పూర్తిగా ఓడిపోయి) చిత్తం.

పేర : మహారాజునకు అభివాదం చెయ్యి.

జనా : జయము జయము ప్రతాపరుద్ర మహారాజునకు.

పేర : జనార్దనా, ఏమి విశేషము.

జనా : మహామంత్రి యుగంధరుల వారు విజయంచేసినారు. వారికి నగర పొలిమేరలో స్వాగతమివ్వాలని మా ఆశయం.

పేర : వారిని నిండు దర్బారులో సన్మానించాలని మా కోరిక. నువ్వు వెళ్ళి వారినీ కూడావున్న వారినందరినీ, శౌందరగా, తిన్నగా, ఇక్కడికి తీసుకునిరావాలి. సన్మానమంతా ఇక్కడ నిండు దర్బారులోనే. తెలిసిందా. ఈలోగా వూరేగింపేమీ కూడదు. అతిరహస్యంగా, ప్రజలకంటు పడకుండారావాలి. తెలిసిందా.

జనా : తెలిసింది.

పేర : వెళ్ళుమరి.

జనా : విద్యానాధులతో ఆలోచించి.

పేర : అనవసరం. ఇది నా ఆజ్ఞ. త్వరగా వెళ్లు

(జనా : తటపటా యిస్తాడు.)

పేర : (క్రీనీగా) ప్రతాపరుద్ర మహారాజుల ఆజ్ఞ.

జనా : చిత్తం. యుగంధర మహామంత్రులే ఈ విషమ పరిస్థితినించి తప్పించగలరు. విద్యానాధా, విద్యానాధా (అంటూ త్వరితంగా నిష్క్రమణ.)

పేర : (సింహాసనం దిగి. నేలమీద మోకరిల్లి) ఔమ్మ దేవుడా, చశం, ధనం, దారిసూపిత్తునె వుండు.

(విద్యానాథుడు ప్రవేశం. వెనుక జనార్ధనుడు)

విద్యా : పేరయ్యా!

(పేరయ్య ఉలిక్కిపడి లేచి, విద్యానాథుడి పాదాలు కళ్ళ నద్దుకుని.)

పేర : పొరపడుతున్నారు గురుదేవా! నేను ప్రతాపరుద్ర మహారాజుని. పేరయ్యని తురకలు బందీగా పట్టుకుపోయారు. వాడిని విడిపించుకొని యుగంధరామాత్యులు వొస్తున్నారు. జనార్ధనా, నువ్వు ఒక్కడవూ వెళ్ళి వారిని ఇక్కడికి తిన్నగా రహస్యంగా తీసుకురా. ఊ... వెళ్ళు

జనా : మాటలు నేర్చిన కుక్కని ఉసుకో అంటే ఉసుకో అందిట.

పేర : నోరు సంబాళించుకుని మాట్లాడు జనార్ధనా!

విద్యా : పరిస్థితి విషమావస్థలో వుంది. జనార్ధనా! నువ్వు వెళ్ళి యుగంధర మహామంత్రిని సత్వరం తీసుకురా. వారు ఒక్కరే విప్పగలరీ చిక్కు.

జనా : చిత్తం

(వెళ్ళిపోతాడు.)

పేర : గురుదేవా! మహామంత్రులకి స్వాగత మివ్వడానికి ఏర్పాట్లన్ని చేయించండి. విశ్వాసరావు, ఏనుమరెడ్డి గార్లకి వెంటనే రమ్మని కబురుపంపించండి. దర్బారు ప్రారంభించండి.

విద్యా : పేరయ్యా.

పేర : ప్రతాపరుద్రా !

విద్యా : (నిట్టూర్పు విడుస్తూ) ప్రతాపరుద్రా. శ్రుతిమించి రాగాన పడకు. శక్తికిమించిన పనులు తలపెట్టకు.

పేర : మీ శిక్షణలో, మీ శిష్యుడిలో మీకే నమ్మకంలేదా గురు దేవా. మీ ఆత్మవిశ్వాసం నశించిందా ?

విద్యా : (ఆలోచనా నిమగ్నుడై) పరమేశ్వరా ! నువ్వు సృష్టించిన మానవుడిలోతులు కనిపెట్టడానికి, కేవల మానవులం మాకు సాధ్యమా ?

పేర : ఎవరుగా అక్కడ. నాట్యబృందాన్ని రమ్మను.

(నాట్యకత్తెలు. సహాయకులు ప్రవేశం)

పేర : ప్రారంభించండి.

(శృతి చేసుకుంటూ ఉపక్రమించ బోతున్నారు)

సైని : (ప్రవేశించి) విశ్వాసరావు, అనుమరెడ్డి గారలు వొచ్చారు. ప్రవేశపెట్టమని అనుజ్ఞా.

పేర : అప్పుడేవద్దు. సమయమొచ్చినప్పుడు వారిని పిలుస్తాము అంతవరకు పెగదలలో వుండమను. గురుదేవా, వారు ఎక్కడికీ వెళ్ళకుండా, వెళ్ళడానికి వీలు లేకుండా ఏర్పాటు చేయించండి.

విద్యా : చిత్తం.

(సైనికుడు, విద్యానాధుడు వెళ్ళిపోతారు. నాట్యం ప్రారంభ మయి కొంతసేపు నడుస్తుంది. పేరయ్య ఉరకటానికి సిద్ధంగా వున్న సింహాలా కూర్చుంటాడు అకస్మాత్తుగా సైనికుడు లోపల ప్రవేశించి)

సైని : జయము జయము మహారాజుగారికి. మహామంత్రి యుగంధరులు విచ్చేసినారు.

(నాట్యం ఆగిపోతుంది. ముందు యుగంధరుడు వెనకాల విద్యానాధ జనార్దనులు ప్రవేశం. సభికులు అందరూ లేస్తారు.)

యుగం : జయము జయము మహారాజునకు.

పేర : (లేచి రాజఠీవితో) స్వాగతము. మహామంత్రి యుగంధరులకు.

(చేతులుజాచి కౌగలించుకోడానికి ఆహ్వానిస్తాడు. యుగంధరుడు ఒక క్షణం తీక్షణంగా చూసి, గబగబనడిచి దగ్గిరకి వెళతాడు)

పేర : (కౌగలించుకుని) ఎన్నాళ్ళకు, ఎన్నాళ్ళకు తిరిగి తమదర్శనం. (చెవిలో) సామీ మోసం. రాజుకి పెమాదం. తురకోడు ముస్తఫాఖాన్, మనోళ్ళే యిశ్వాసరావు, అనుమరెడ్డి, రాజు పానాలు తీస్తమని కుట్రజేసింద్రు. గని రహస్యంగ ఈడకి రమ్మన్న. ఆల్లని ఖైదు చేయించి రాజుని కాయండి. (పైకి) సుఖముగా తిరిగి వొచ్చినందుకు చాలా సంతోషమయినది.

యుగం : (చెవిలోనే) తెలిసింది. తెలిసింది. మరి భయంలేదు. (పైకి) తమ అనుగ్రహానికి కృతజ్ఞుణ్ణి.

పేర : మీ కబురు తెలియక చాలా విచారపడినాము. మా మంత్రులెవరూ కూడా చిన్నవార్త నాకు చెప్పలేదు.

యుగం : క్షమించాలి. వారిదికాదు తప్పు. నేనేవారికి కబురేమీ పంపలేదు. తమతో విన్నవించుకోడానికి వారికేమీ తెలియదు.

పేర : మీ కోసం అదుర్దాగా వుంటామని తెలుసును కదా! ఎందుకు అలాచేశారు.

యుగం : ప్రయోగఫలితం తెలిసిన తరువాతగదా, ప్రచారము.

పేర : తెలిసింది. తెలిసింది. వెళ్ళినపని చేసుకువచ్చారు.

యుగం : అనుకున్న ప్రకారము. అనుకున్న సమయానికి.

పేర : పేరిగాడిని విడిపించి, ఇక్కడికి తెచ్చారు.

యుగం : తెచ్చాము.

పేర : పాపం చాలా కష్టపడివుంటాడు. కోటలో వుంచండి. మేమే స్వయంగా దర్శించి ఆదరిస్తాము. ఏర్పాటు చేయించండి.

యుగం : చిత్తం (చీటీవ్రాసి) జనార్దనా, మహారాజుల ఆజ్ఞ. దీని ప్రకారం ఏర్పాట్లు చేయించు.

జనా : (పుచ్చుకుని) చిత్తం! (వెళ్ళిపోతాడు).

విద్యా : జయము జయము మహామంత్రులకు !

యుగం : విజయోస్తు. విద్యానాథా, నీ ప్రజ్ఞ మాకే గర్వకారణం.

విద్యా : (కొంచెం సిగ్గుపడుతూ) బెడిసి కొట్టినప్పుడు మీరు మంత్రము చేతకాకపోయింది.

యుగం : నీ కృషి, ఊహాతీతమై, అమోఘమై ఫలించింది. విద్యానాథా, నీ ప్రయోగానికి బెడసలా.

విద్యా : మీ విశ్వాసానికి అనర్హుణ్ణి మహామాత్యా.

యుగం : భగవంతుడు ప్రసాదించిన కేవల రూపానికి, గుణం, బుద్ధి ప్రతిష్ఠించిన అపర సృష్టికర్తలు. ఆత్మ విశ్వాసమా మీకు కొదువ

విద్యా : నా ఆత్మవిశ్వాసంకాదు నన్ను నడిపినది. మీ ప్రజ్ఞ. మేమేమి తప్పులు చేసినా తమరు దిద్దుకుపోగలరు; మాకు

రక్షణమార్గము చూపగలరన్న మీమీది విశ్వాసము. దానికీనాటికీ చలనము లేదు.

(జనార్ధనుడు ప్రవేశిస్తాడు. అర్థంకాని విషయాలు ఎన్నో జరుగుతున్నట్లు మొహం)

జనా : జయము జయము, మహామంత్రిగారికి. ఆజ్ఞ పాలింపబడినది.

యుగం : ఏర్పాట్లు అన్నీ పూర్తి అయినవి. మహారాజు లింక పేరిగాడికి దర్శన మివ్వడానికి బయలుదేరవచ్చును.

పేర : పేరిగాడిని యింక ఎవరూ, ఏమీ చెయ్యలేరు. ప్రమాదమేమీ లేదు.

యుగం : ప్రమాద మేమీ లేదు. ఎవరూ ఏమీ చెయ్యలేరు.

పేర : ఢిల్లిలోనూ, ఇక్కడా శత్రువు లందరూ తుడిచిపెట్టుకుపోయినట్టేనా? ముస్తఫాఖాన్ … …

(యుగంధరుడు జనార్దనుడికేసి చూస్తాడు.)

జనా : భేతాళరావు పర్యవేక్షణలో సురక్షితుడై వున్నాడు.

యుగం : ఆందోళన అనవసరం. శత్రుశేషమున్నా, అవి కోరలుపీకిన పాములు. వాటికాటులో విషంలేదు. బలంలేదు. ఫలితంలేదు.

పేర : ఇంక రాజ్యమంతా మీ చేతిలో పెట్టి అందరూ నిద్దరపోవచ్చు.

యుగం : నిశ్చింతగా.

(పేరయ్య గబుక్కున సింహాసనంమీదనించి దిగి విద్యానాథుడి కాళ్ళమీద వాలతాడు.)

పేర : బెమ్మదేవుడా, రచ్చించాలి.

(ఇప్పటికి అర్థమవుతుంది విద్యానాథుడికి. తను వూహించని నాటక మేదో పేరయ్య ఆడించి, ప్రమాదం తప్పించాడని.)

విద్యా : (ఎత్తి పేరయ్యని కౌగలించుకుని) పుత్రాదిచ్ఛేత్ పరాజయం. నేటికి నా జీవితం ధన్యమైంది. విడమర్చి చెబితేనేగాని వివరాలు వూహించుకోలేని స్థితిలో వున్నాను.

పేర : (విడిపించుకుని మళ్ళీ పాదాలకి నమస్కరించి) మీ పాదాల కడోణ్ణి మీ అగ్గె నేందె యేం సేసినోణ్ణికాను. ముస్తఫఖా నొచ్చి నాను సాకలోడినన్న చంగతి కనిపెట్టి పోయిందు. ఢిల్లీలున్నది రాజేనంటు, కబురెట్టిందు. యుగందరమంతిరి ఢిల్లీలున్నరు, జాగర్తనికూడా కబురెట్టిందు. రాజుకి కైదు తప్పింతమంటె పెమాదమన్నరు. యిశ్వాసరావొచ్చి మరో మోసం చెప్పిందు. ఢిల్లీలో రాజు సత్తుండు, అప్పుడు నిన్ను మల్ల సాకల్నిజేసి జనార్దను, పిల్లోడి పేర రాజ్యమేల్తరు, అల్లిప్పుడు నిన్ను మోసంజేసి రాజు చేస్రిను. అల్లని నువ్వు మోసంజెయ్యి, నువ్వె పెతాపరుద్ద మహారాజునను. అందరు నిన్ను సూసింద్రు. బాగ నాటక మాడినవు. అప్పుడు అల్లేం చెయ్యనేరు అని మోసంచెప్పిందు. ఓ చనం ఆశవుట్టిన్ది. బెమ్మదేవుడా! (లెంపలేసుకుంటాడు) ఆనక మీరు గేపక మొచ్చింద్రు. మా రాజుల ఉప్పుతిన్నవు. ఎదవపని సెయ్యకని మనసులో సెప్పింద్రు. ఎల్లికూడ అట్టె సెప్పింది. ఇశ్వాసరావు యెనక సాలమంది వున్నరన్నడు. అల్లందర్ని పట్టి పెమాదం తప్పించనకి యేం సెయ్యాలో తెలీక పానం పోనది గురుడా. మోసం చెయ్యొద్దని బుద్దిచ్చినవు. మోసంకొట్టి పెమాదం తప్పించనానికి యింక శాన బుద్దిచ్చి దారి సూపియ్యి అని ఛనం ఛనం తమర్ని తల్సుకుంటె యీ దారి చూపిచ్చింద్రు. నీ పెగ్గె చూపియ్యి

అని వుషారిచ్చిండ్రు. మీతో చంగతి చెప్పుకోనానికి యీల్లేకపోయిన్ది చమించాలి.

విద్యా : (హృదయానికి హత్తుకుంటూ) నా అవిశ్వాసానికి లజ్జితుణ్ణి చేస్తున్నావు పేరయ్యా.

జనా : మూర్ఖుడు వీడికేంతెలుసు. వీడేంచెయ్యగలడన్న గర్వంలో అంధుణ్నయి ఏమీ కనిపెట్టలేని నా అజ్ఞతకి క్షమించాలి.

యుగం : (ఏదో వ్రాస్తూ పూర్తిచేసి) విశ్వాసపాత్రుడేగాదు జనార్ధనా. విద్యానాధులనే మభ్యపెట్టగలిగిన ప్రతిభావంతుడు ఈనాడు పేరయ్య. ఆ ప్రతిభకి తగినపదవి ప్రసాదించాలి. ఈ పత్రం మహారాజులకి చూపి వారి అంగీకారముద్ర తీసుకురా. (జనార్దనుడికి యిస్తాడు. జనార్దనుడు పత్రం తీసుకుని వెళ్ళిపోతాడు.)

పేర : (యుగంధరుడి పాదాలకి మొక్కి) కటాచ్చించాలి. సాకలోణ్ణి యిడిసిపెడితె యింటికి పోతను.

యుగం : కాదు పేరయ్యా. కాకతీయసామ్రాజ్యానికి నువ్వు చేసిన సేవ విస్మరింపరానిది.

పేర : నానేం జేశాను సామి. గద్దిమీదెగ్గ, బెమ్మదేవుడి చలవ.

యుగం : ఇది నీ ప్రాజ్ఞతకి తార్కాణం. సింహాసన మెక్కి నామమాత్రంగానైనా కాకతీయ సామ్రాజ్యాన్ని పాలించి మా గౌరవ ప్రతిష్ఠలు నిలిపిన యోగ్యుడివి. కుట్ర కనిపెట్టి సామ్రాజ్యాన్ని సంరక్షించిన బుద్ధిశాలివి. కవివశంతప్పి కవికే యశంతెచ్చిన పాత్రవి.

విద్యా : సందేహంలేదు. కవి కల్పనకు మించి కలలుపండిన పాత్ర.

(జనార్దనుడు తిరిగొచ్చి పత్రం యుగంధరుడికి యిస్తాడు. దాన్ని కళ్ళ నద్దుకుని)

యుగం : పేరయ్యా! ఇది నీకు మహారాజు ప్రసాదించిన పదవి. వరంగల్లు పర్గణాలో యిరవై అయిదు గ్రామాలకి పట్టా, నీకు రాజబిరుదం. భద్రంగా దాచుకో.

(పేరయ్య తీసుకుని కళ్ళనద్దుకుంటాడు)

యుగం : జయము జయము పేరయ్య రాజునకు

జనా :
విద్యా : జయము జయము పేరయ్య రాజునకు.

పేర : (విద్యానాథుడి కాళ్ళుపట్టుకుని) ఔమ్మదేవుడా, గిప్పుడు యెల్లిని బయంనేకుండ నూసొకవొచ్చున!

విద్యా : నిరభ్యంతరంగా!

పేర : గిప్పుడు నే నిజంగ రాజయితె, నిజంగయెల్లి రాణవుద్ద!

విద్యా : సందేహం లేదు.

యుగం : ఇక్కడికి కార్య మయింది. విద్యానాథా, జనార్దనా, మహారాజులదర్శనం చేసుకుందాం రండి. పేరయ్యా యెల్లి దివాణంలో వుంది. పోయి కలుసుకో. తరవాత నీకు మహారాజుల దర్శనం.

పేర : సిత్తం. మీారెట్ట సెబితె అట్ట యినుకుంట.

(యుగంధరుడు, జనార్దనుడు, విద్యానాధుడు వెళ్ళిపోతారు. పేరయ్య ఒక్కడూ వుంటాడు.)

పేర : గిప్పుడు సత్తెంగ నేరాజయితె, ఎల్లి రాణి అవక ఏంజేస్తది!

(సేవకుడు ప్రవేశించి)

సేవ : జయము జయము పేరయ్యా రాజావారికి. యెల్లి తమ కోసం కాసక్కూచుంది.

పేర : లగెత్తుతున్న. నిన్నుసూసి శానాళ్ళయిపోయిందె యెల్లి. ఎంత చక్కంగ యేసమేసి అందర్ని దంగెత్తించెచొ చెప్పు కుంటు. (అనిపరుగెత్తబోయి తమాయించుకుని ఆగి) వొరేయ్! చింవాచనంమీద కూకుంటను. యెల్లి నీడకె రమ్మను.

సేవ : చిత్తం (వెళ్ళిపోతాడు).

పేర : (వెళ్ళి సింహాసనం మీద కూర్చుని రాజ ధోరణిలో) ఎల్లి. విశేషము లేమి? నీకు కుశలమా? కూర్చుండుము. ఇన్ని రోజులు కనిపించలేదేమి? (చాకలి ధోరణిలో) యెల్లి అనుకుంటుంది నేనింక యేసమేస్తున్న. రాజునికాదు వుత్త పేరయ్యమావనె అనుకుంటది. యేటిమావాఁ అట్టు మాట్టాడొద్దు. అంటది. పో. పో. నేరాజుని (బిరుదుపట్టి చూపిస్తూ) గిది సూస్కో అంటు. గిప్పుడు నువ్వురాణివి. చింవాచనం మీద తిన్నగ కూసోవాలంటు! సాకలిమాట వొదిలిపెట్టేసి, రాసోరిలా మాట్టాడు అంటు! మాట్టాడ్డం, నేను నేర్పుతనంటు. అ. చి. క్ష. అట్టుగాదే. నాలికిట్టుబెట్టి 'క్ష' గది నంజె టుక్కులు జేస్తె, నాను రాసోరి టుక్కులు. యీణవోయించొన్.

వీణానాదం, (తెర)

